ఈ సందర్భంలో సాధారణంగా లోకదృష్టితో నాటకాలు నా జీవితానికి చేసిన మంచిచెడ్డలు చర్చించడం చాలా అవసరము. నాయుడుపేటలోనూ, ఒంగోలులోనూ ఉన్నప్పుడు నాటకాలవృత్తి నన్ను ఒక విధంగా చిన్నతనపు చిలిపిచేష్టలనించి తప్పించింది. కాని ఆతతాయులతో సాహచర్యం కలిగింది. నా జీవితప్రారంభంనించీ కూడా బహుశః ఒక అదృష్టం నన్ను వెంటాడిస్తోందని చెప్పాలి. స్నేహాలవల్ల, సాహచర్యాలవల్ల జీవితం అధఃపాతాళంలోకి పడిపోయే పరిస్థితులలో పడడమూ, మళ్ళీ వాటిల్లోనించి దైవికంగా తప్పుగుని బయట పడడమూ జరుగుతోంది. అదే ఈ నాటకాల ప్రకరణంలో కూడా జరిగింది. రాజమహేంద్రవరం నాటకాలలో కూడా ఇదే జరిగింది. నా నాటకాలలో అభినయనైపుణ్యం చూసి పేరుపొందిన పెద్ద లంతా, మన్నించి, హర్షించేవారు.

మేము ఆ రోజుల్లో ప్రస్తుతం టౌనుహాలుకి తూర్పున ఉన్న పెద్ద ఖాళీస్థలంలో తాత్కాలికంగా ఒక పెద్ద నాటకపు హాలు నిర్మించాము. ఒకసారి మేము అందులో నాటకం ఆడుతూఉంటే, సుప్రసిద్ధన్యాయవాదులై, కాంగ్రెసు అధ్యక్షపదవి అలంకరించిన పి. ఆనందాచార్యులుగారు వచ్చి చూశారు. ఆయన అప్పుడు పిఠాపురంవారి కేసుసందర్భంలో వచ్చారు. అప్పుడు నా అభినయానికి మెచ్చి ఏదో బహుమతీ కూడా ఇచ్చారు. ఆ మెప్పు అల్లా ఉండగా ఆ సంవత్సరం ౧౮౯౭ లో మెట్రిక్యులేషన్ తప్పింది! క్రమంగా రౌడీలతో స్నేహం చేసి కొట్లాటల కక్షల్లో పడ్డాను.

ఇంతకన్నా ప్రమాద మైనది నా నైతికప్రవర్తన. నేను నా అభినయంవల్ల నాకు తెలియకుండానే కొందరు అమాయికస్త్రీల మనస్సులు కలవరపెట్టాను. ఆ కలవరంలో నేను కూడా ప్రమాదంలో పడ్డాను. చారిత్రికపౌరాణికనాటకాలవల్ల నటకుల్లోనూ, ప్రేక్షకుల్లోనూ కొంత జాతీయతా, స్వాతంత్ర్యభావమూ హెచ్చినా నైతికంగా కొన్ని ప్రమాదాలు కలుగుతూవచ్చాయి. ఇంతకాలం అయ్యాక నేను వాటికి కారణాలు వివరించడం కష్టం కాని, అప్పటికి నాటకాలవల్ల కలిగిన ప్రమాదాలు మాత్రం అవి.

ఈ కాలంలో నా విద్యార్థిదశనిగురించి కూడా కొంచెం వ్రాస్తాను. నేను మొదటినించీ నిర్లక్ష్యంగా బ్రతిగిన ఘటాన్ని! దానికితోడు సర్వస్వతంత్రులైన హనుమంతరావునాయుడుగారి తయారీ. హనుమంతరావు నాయుడుగారు మంచి ఒడ్డూ పొడుగూ ఉన్న మనిషి. ఆయన బుగ్గమీసాలు మంచి భీకరంగా ఉండేవి. చూడడానికే ఆయన గంభీరంగా ఉండేవారు. ఆయన తరగతుల్లో పాఠాలు చెబుతున్నప్పుడు కూడా స్వాతంత్ర్యం మహత్తర మైన దని చెబుతూ ఉండేవారు. ఉదరపోషణ కోసం నౌఖరీలో ఉన్నా, వస్తుతః నౌఖరీ లంటే ఆయన కిష్టం లేదు. తన అనుచరుల్లో ఏ మాత్రం స్వాతంత్ర్యపు పోకడ లున్నా ఆయన ప్రోత్సహించేవారు. ఎందుచేతనో ఆయనకి నేను ఎన్ని గత్తరల్లో పడినా చివరకి తేల్తా ననే ఒక నమ్మకమూ, దృఢవిశ్వాసమూ ఉండేవి. కనక ఆయన నా వ్యవహారా లన్నీ చూసీచూడనట్టుగా ఉండి, పైనించి, కంటికి రెప్పలా

కవిపెడుతూ ఉండేవారు. చదువులో కొంత శ్రద్ధగానే ఉండేవాణ్ణి. కాక పోతే కొంచెం పొగరబోతుతనం అనేది ఉండేది.

ఆ రోజుల్లో గోదావరికి ఈ కట్ట లేదు. 'నేనూ మిత్రులూ కలిసి చాలావరకు పగ ల్లా గోదావరీగర్భంలో గడిపేవాళ్ళం' అంటే ఆశ్చర్యం ఏమీ లేదు. సాధారణంగా రేవునిండా పడవ లుండేవి. కాస్త వేసవి తిరిగేసరికి రేవుల్లో పడవలు ఏట్లోకి తోసుకుపోయి రాత్రిళ్ళ ఇసకతిప్పల్లో కాలక్షేపం చేస్తూ ఉండేవాళ్ళము. ఒక లాంతరు పట్టుకుపోయి అక్కడే చదువుకునేవాళ్ళము. మాకు గోదావరిలో ఈతాలాడడం నిత్యకార్య క్రమం. విద్యార్థిసంఘాలు స్థాపించి, చెడుగుడు, ఉప్పట్టి, మొదలయిన ఆటలు ఆడేవాళ్ళము. రెండు పార్టీలుగా ఏర్పడి ఒక పార్టీతో ఇంకొక పార్టీ సవాల్ చేసి, మంచి పట్టుదలగా ఆడుకుంటూ ఉండేవాళ్ళము. అందులో నేను మంచి ఆటగాడి కిందే లెఖ్ఖ. ఇక దీపావళిపండుగ రోజులసంగతి చెప్పనే అక్కరలేదు. పండుగనాడు రకరకాల బాణా సంచాలతో యుద్ధాలు సాగవలసిందే! పండుగ పదిరోజులు ఉంది అనగా ఈ మందుగుండు సామాను తయారు చేసి పార్టీలకి సవాళ్ళు చేసేవాళ్ళము. నేను ఈలాంటి ఒడుదుడుకు పరిస్థితుల్లో చదువుకుంటూ ఉండేవాణ్ణి.

అప్పట్లో రాజమహేంద్రవరంలో రౌడీజట్లు బాగా ఉండేవి. పెద్ద మనుష్య లనుకునే వాళ్ళల్లో చాలామందికి ఈ రౌడీలతో సంబంధాలు ఉండేవి. చూస్తూఉండగా ఏ వీధిలోనో రెండుపార్టీలు తటస్థపడి అమాం తంగా ఒకళ్ళని ఒకళ్ళు పడపడ కొట్టుకుంటూ ఉండేవాళ్ళు. నేను కూడా

ఈ పార్టీల గందరగోళంలో పడ్డాను. ఆ పడడంలో సంఘంలో కింద శ్రేణిలో ఉండే జనంతో సంపర్కం కలగడంలో ఆశ్చర్యం ఏమి ఉంది? చేపలు పట్టుకుని జీవించే బెస్తలతోనూ వాళ్ళ నాయకులతోనూ చేతులు కలపవలసివచ్చింది. వాళ్ళ అభిమానం సంపాదించడానికి వాళ్ళఇళ్ళకి కూడా వెళ్లేవాణ్ణి. వాళ్లు కల్లు తాగుతూ ఉంటే పక్కని ఉండవలిసిన అవస్థ కూడా కలిగేది. కాని ఎన్నడూ అది ముట్టుకోవాలనే ధోరణి మాత్రం కలగలేదు.

ఈ కాలంలోనే నాకొక బ్రహ్మాండమైన గండం తప్పింది. ఒక సారి గోదావరి మంచి వరదలో ఉన్నప్పుడు నేనూ కొంతమంది స్నేహితులూ కలిసి ఒక చిన్న పడవ ఏట్లోకి తోసుకువెళ్ళాము. తెడ్డు ఒకటే దానికి చుక్కాని. నేను చుక్కానిదగ్గిర ఉన్నాను. పడవ కోటి లింగాలదాకా బాగా ఎగువుకి పోనిచ్చి ఏట్లోకి వాలుగా ఒదిలివేశాము. నావ ప్రవాహంలో మంచి జోరుగా వస్తూఉంటే నా చేతిలో ఉన్న చుక్కాని జారిపోయింది. దానికోసం నేను గభాలున ఏట్లోకి దూకాను. దాంతో నా స్నేహితులు కంగారు పడ్డారు. నేను తెడ్డు పట్టుకుని పడవ దగ్గిరికి చేరాను; కాని పడవ ఎక్కలేకపోయాను. పడవలో ఉన్న స్నేహితులు నన్ను చూసి కంగారు పడడమే కాని తెడ్డు చేతి కందివ్వాలని ఎవరూ అనుకో లేదు. నేను అల్లాగే ఒకటిరెండు సార్లు పడవ దగ్గిరికి వెళ్ళడం పడవ ఎక్కలేకపోవడం జరిగింది. చాలాసేపు ప్రాణాల మీద ఆశ ఒదులుకుని ఆ మహానదితో యుద్ధం చేశాను. చిట్టచివరికి నేనే

నా స్నేహితులికి తెడ్డు అందివ్వం డని సూచించాను. దాంతో వాళ్ళు తెడ్డు అందివ్వగా దాని ఊతంమీద పడవపైకి వచ్చాను. ఈరీతిగా మృత్యు సన్నిధికి వేంచేసి వెంట్రుకవాసి తేడాలో అక్కడినించి బయటపడ్డాను.

౧౮౮౯ వ సంవత్సరంలో ప్రైవేటుగా చదివి మెట్రిక్యులేషన్ పాసయినాను. నేను ౧౮౮౭ వేసవికాలంలో ఒంగోలు ఒదిలినప్పటినించీ మళ్ళీ ఒంగోలు వెళ్ళలేదు. ఆ తరవాత నేను కొద్దిరోజులపాటు రాజమహేంద్రవరంలో స్వంతంగా వండుకుని భోజనం చేసేవాణ్ణి. తరవాత కొన్నాళ్ళపాటు హోటల్లో భోజనం చేశాను. చివరికి నా చదువుకి తగిన భోజనవసతి కుదరకపోవడంవల్ల మా అమ్మమ్మగారిని ఒంగోలునించి తీసుకువచ్చాను. మేము ఆ తరవాత ఇన్నీసుపేటలో నోరివారి ఇంట్లో ఒక చిన్నగదిలో ఉండేవాళ్ళము.

మెట్రిక్యులేషన్ పరీక్ష పాసయిన తరవాత "మరి ముందు సంగతి ఏమిటి?" అనే సమస్య వచ్చింది. నా లక్ష్య మెప్పుడూ ప్లీడరీమీదే ఉండే దని ఇదివరకే వ్రాశాను. రాజమహేంద్రవరంలో రాడీజనాభాతో జోస్తీగా ఉండే సమయంలో కూడా నా మనస్సు ఆ న్యాయవాదివృత్తి మీదనే లగ్నమై ఉండేది. మెట్రిక్యులేషన్ పాసవడంతోనే పెద్దపెద్ద ఉద్యోగాలు కూడా సంపాదించడానికి అవకాశం ఉన్న రోజు లవి. స్నేహితులు కొందరు "ఎన్నాళ్ళు నువ్వు నాయుడుగారిమీద ఆధారపడతావు. ఏదో మెట్రిక్యులేషన్ అయింది కనక మరి నౌఖరీలో జేర" మని సలహా ఇచ్చారు. నా దృష్టి అయితే కళాశాలలో చదివి ప్లీడరీ చెయ్యా

లని ఉండేది. కాని నిజంగా నాయుడుగారికి నే నిచ్చే శ్రమ చూస్తే స్నేహితులు చెప్పిన సలహా న్యాయమైన దేమో ననిపించింది.

గుమస్తాపని చేస్తూ కూడా ప్రైవేటుగా ప్లీడరీకి చదివే అవకాశం ఉండడంచేత చిట్టచివరికి ఇష్టం లేకుండానే రాజమహేంద్రవరం సబ్‌రిజిష్ట్రారు ఆఫీసులో రెండో గుమాస్తాపనికి దరఖాస్తు చేశాను. జీతం ౧౫ రూపాయలు. నేను దరఖాస్తు చేసినట్లుగానే సబ్‌రిజిష్ట్రారుగారు నా దస్తూరీ పరీక్ష చెయ్యాలనీ, తెలివితేటలు చూడ్డం నిమిత్తమై ఒకసారి తనని చూడవలసిందనీ నోటీసుచేశారు. ఆ నోటీసు నాకు ఆత్మగౌరవానికి భంగకర మని తోచింది. నేను "మెట్రిక్యులేషన్ పాసు అయినట్లు సర్టిఫికెట్టు ఉండగా మళ్ళీ ఈ పరీక్ష ఏమిటి? నీ ఉద్యోగం నా కక్కర లేదు పో"మ్మని జవాబు వ్రాశాను. దాంతో ఆ ఉద్యోగం తప్పింది. ఏ మనిషి జీవితంలో నైనా ఇల్లాంటి స్వల్పవిషయాలతోనే జీవితపంథా మారిపోతూ ఉంటుంది. బహుశః ఆనాడు నేను సబ్‌రిజిష్ట్రారు ఆఫీసులో చేరిఉంటే ఏ మయ్యేవాణ్ణో కూడా చెప్పడం కష్టము.

నేను మెట్రిక్యులేషన్ మొదటి సంవత్సరం చదువుతూ ఉండగానే ఇక్కడ రౌడీలతో స్నేహం చేస్తున్నాననీ, నాటకాల్లో తిరుగుతున్నాననీ, చదువు గుంటపెట్టి గంట వాయిస్తున్నాననీ మా అమ్మగారికీ, నాన్న గారికీ, బంధువులికీ తెలిసింది. ఈవిషయం మా అమ్మగారిని చాలా బాధపెట్టింది. నాకు వండిపెట్టడానికి వచ్చిన మా అమ్మమ్మగారు కూడా నా అవస్థ చూసి బాధపడుతూ ఉండేది. నేను ౫వ క్లాసు చదువుతూ

ఉండగానే మా అమ్మగారు నాకు వివాహం చెయ్యాలని సంకల్పించింది. ఆవంకనైనా దూరాన్ని ఉన్న నేను అక్కడ ఎక్కడో ఉండి పాడైపోకుండా ఇంటికి వస్తానేమో నని ఆమె ఆశ.

నేను రాజమహేంద్రవరం వచ్చాక మా కుటుంబానికి ఇంకొక ఆపత్తు వచ్చింది. మా పెద్దఅక్కయ్య జానికమ్మగారు చనిపోయింది. అప్పటికి ఆవిడకి చాలామంది పిల్లలు పుట్టి పోయారు. చివరికి హనుమాయమ్మ అనే పిల్ల ఒక్కర్తే మిగిలింది. ఆవిడ చనిపోయేటప్పుడు మా అమ్మగారిని దగ్గిరికి పిలిచి ఆ పిల్లని ఆవిడ చేతుల్లో పెట్టి, పిల్లని జాగ్రత్తగా పెంచమనీ, ప్రకాశాని కిచ్చి పెళ్ళి చేయమనీ చెప్పింది. అందుచేత హనుమాయమ్మ నిచ్చి నాకు పెళ్ళి చెయ్యాలని మా అమ్మగారు ఆత్రతపడింది. కాని రాజమహేంద్రవరంలో నాకు వచ్చిన పేరుప్రతిష్ఠలు విని మా బావగారు మాత్రం నాకు పిల్లని ఇవ్వడానికి సందేహించారు. చివరికి మెట్రిక్యులేషన్ పాసయ్యాక కొంత ధైర్యం వచ్చి, మా బావగారు నాకు కూతుర్ని ఇవ్వడానికి అంగీకరించారు.

మా అమ్మగారు అద్దంకిలో వివాహం చెయ్యడానికి నిశ్చయించి, ముహూర్తం పెట్టించి, కబురు పంపించింది. నేను మా అమ్మమ్మగారిని ముందు పంపించి ౧౮౯౦ ఫిబ్రవరిలోనో, మార్చిలోనో అద్దంకి చేరాను. రాజమహేంద్రవరంనించి బెజవాడదాకా కాలవమీద వచ్చి, అక్కడినించి గుంటూరుమీదుగా అంచెబళ్ళమీద అద్దంకి చేరుకున్నాను. వివాహం చాలా సామాన్యంగా జరిగింది. కావలసిన బంధువులు నలు

గుటా వచ్చి ఐదురోజులూ పెళ్ళి సులువుగా తేల్చారు. మా అమ్మగారు నాపెళ్ళితోబాటు మా చెల్లెలు అన్నపూర్ణ పెళ్ళి కూడా చేసింది. అప్పటికి అన్నపూర్ణకి సుమారు ౭ సంవత్సరాల వయస్సు ఉంటుంది. మా అమ్మగారు మా పెద్దఅప్పగారు చనిపోయింది కనక అన్నపూర్ణని మా బావగారికే ఇచ్చి వివాహం చేసింది. నేను పెళ్ళికి వచ్చేసరికే మా అమ్మ గారు కార్యక్రమం యావత్తూ నిర్ణయించింది. మొత్తంమీద నా అభిప్రాయా లెల్లా ఉన్నా పెళ్ళి జరిగిపోయింది.

నా వివాహం అయిన వెంటనే మళ్ళీ కాలేజీలో చేరడానికి రాజ మహేంద్రవరం వచ్చాను. అప్పటికి యమ్. యస్. యమ్. రైల్వేలైను వేస్తున్నారు. ఆ రోజుల్లో బెజవాడనించి సంతమావులూరువరకూ రైలు పడింది. నాకు యఫ్. ఏ. పుస్తకాలు ఒక మోపెడు ఉండేవి. అవన్నీ ఒక మనిషి నెత్తిని పెట్టి, మా ఊరినించి నడిచి, సంతమావులూరు వచ్చి, అక్కడ రైలెక్కి, బెజవాడ చేరి, మళ్ళీ పడవమీద రాజమహేంద్రవరం చేరుకున్నాను. వివాహసందర్భంలో నేను చెప్పవలసిందల్లా ఆనాటి పెళ్ళిళ్ళసొంపు. పెళ్లి అంటే వేలకివేలు మూట కట్టుకుని బెంగపడవల సిన అవసరం ఉండేది కాదు. అయిదురోజులు పెళ్లి అయినా నలుగురూ కలిసి పనిచెయ్యడంవల్ల సూక్ష్మంగా తేలిపోయేది. లక్షాధికారులైనా పల్లెటూళ్ళో ఉన్న భజంత్రీలమేళం, పల్లకీ, రామడోళ్ళు మాత్రమే కుదు ర్చుకునేవారు. భిక్షాధికారులైనా అంతే! వంటబ్రాహ్మణుల ఆర్భాటాలూ అవ్వీ ఏమీ లేవు. తరవాత నా చేతిమీదుగా నేను మా కుటుంబంలో అయితే

ఏమి,—హనుమంతరావునాయుడుగారి కుటుంబంలో అయితే ఏమి—అనేక వివాహాలు చేయించాను. ఈ వివాహాల్లో ఆర్భాటమూ, ఆడంబరమూ, శ్రమేకాని, ఆనాటి సౌలభ్యమూ, సౌఖ్యమూ లేవని అనిపిస్తోంది.

ఈ కాలంలో నా సహాధ్యాయుల్నిగురించీ, సహచరుల్ని గురించీ కొంచెం వ్రాస్తాను. నేటి సర్ కె. వి. రెడ్డినాయుడు నేను రాజమహేంద్రవరంలో చదువుకి ప్రవేశించి నప్పటినించీ కూడా నా సహాధ్యాయి. అతని తండ్రిగారు అప్పట్లో తాలూకాకచ్చేరీలో చిన్న బంట్రోతుగా ఉండేవారు. అతను అరుగుమీద కూర్చుని చదువుకోవడం నా కిప్పటికీ జ్ఞాపకం ఉంది. అతనైతే క్లాసులో—'Good boy' అంటే—'మంచి పిల్లవాడి' కిందే లెఖ్ఖ. నేను నా సహాధ్యాయుల్ని ఏదో విధంగా అదమాయిస్తూ ఉండేవాణ్ణి. ఇన్ని సంవత్సరా లయిన తరవాత ఈ విషయాలు జ్ఞాపకం చేసుకుని వ్రాయడానికి నేను చాలా గర్వపడుతున్నాను. నా మిత్రుడు కూడా అల్లాగే గర్వపడతాడని అనుకుంటాను. "ఎటువంటి సామాన్యపరిస్థితుల్లోనించి మేము నిగ్రహించుకు వచ్చాము!" అని తలచుకున్నప్పుడు ఇదంతా నాకే ఆశ్చర్యంగా ఉంటుంది. తరవాత మునిసిపల్ వ్యవహారాల్లో వెంకటరెడ్డి నాకు కొంచెం దూరం అయ్యాడు. క్రమంగా రాజకీయాల్లో మేము ఇంకా దూరులమై ఇప్పుడు కేవలమూ ప్రతికూలరాజకీయపక్షాల్లో ఉన్నాము. కాని వ్యక్తిగతంగా నా మనస్సులో ఉన్న ఆనాటి ప్రేమ కేమీ కొరత కలగలేదు. అతనికీ అల్లాగే ఉంటుందని నమ్ముతున్నాను.

మహమ్మదు బజులుల్లా సాహేబు కూడా నాకు సహాధ్యాయి. అతను ఎంతెంత పుస్తకాలైనా బటీపట్టడంలో మంచి ఘనుడు; ఇంగ్లీషు బాగా

ప్రాస్తా దనే ప్రతీతి ఉండేది. అతను బి. ఏ. అయి సర్వీసులో పడిపోయాడు గనక మాకు అంతగా సంబంధం లేకపోయింది. ఇక రాజమహేంద్రవరంలో ఇప్పటికీ జీవించి ఉన్న సారంగు భీమశంకరం కూడా నా సహచరుడే. అతని తమ్ముడు సోమసుందరమూ, నేనూ సహాధ్యాయులము. భీమశంకరం మాకన్న పెద్దక్లాసులో చదివినా, మెట్రిక్యులేషన్‌లో దండయాత్రలు చెయ్యడంవల్ల మేము అతన్ని కలుసుగున్నాము. వాళ్లు నా కిప్పటికీ జ్ఞాపకం ఉండడానికి కారణం నాకు వాళ్ళ ఇంట్లో ఉండే చనువు. నేను వాళ్ళతో పాటే వాళ్ళఇంట్లో వాళ్ళ పిల్లవాడిలాగే మెలుగుతూ ఉండేవాణ్ణి. నాటకాలు చూసి అర్ధరాత్రి వచ్చినా అపరాత్రి వచ్చినా, వాళ్ళ ఇంట్లోనే పడుకుని వాళ్ళతో కలిసి తెల్లవారకుండా వంటఇంట్లో చద్దిఅన్నము తింటూ ఉండేవాణ్ణి. మెట్రిక్యులేషన్‌లో శంకరాన్ని "గుబ్బక్" అని పిలిచేవాళ్ళము. ఎందుచేతనో కాని ఒకే క్లాసులో పరీక్షలు తప్పేవాళ్ళని అల్లాగ పిలిచే వాళ్ళము. మెట్రిక్యులేషన్ పాసయ్యాక అతను ఎక్కడా అడ్డు లేకుండా పరీక్షలు పాసయి, ప్లీడరు అయ్యాడు. మళ్లీ ప్లీడరీకి చదివినప్పుడు మే మిద్దరమూ కలిసి చదివా మేమో అనుకుంటాను.

ఇక నా జీవితంలో అత్యంతసన్నిహితమిత్రుడూ, నాకు అనేక విధాల సహాయం చేసిన ఆప్తుడూ, నారాజకీయా లెల్లా ఉన్నా నన్నాదరించిన ఆత్మీయుడూ అయిన కంచుమర్తి రామచంద్రరావు. నేను ౫వ క్లాసు చదివి నప్పటినించీ నా సహాధ్యాయిగా ఉండేవాడు. పాపం! చదువులో అతను

సామాన్యంగా ఉండేవాడు; పరీక్షల్లో మార్కులు వచ్చేవికావు. అతను చాలా విశాలహృదయుడు; ప్రేమ పాత్రుడు. చదువుకునే రోజుల్లోనే నాకు స్వల్పంగా కావలసిన ధనసాహాయ్యమూ అదీ చేస్తూ ఉండేవాడు. క్రమంగా మే మిద్దరమూ చాలా జోస్తీగా తిరిగేవాళ్ళము. తరవాత జీవితంలో కూడా నా కతను చేసిన సాహాయ్యం ఎన్నడూ మరవలేను. నేను బారిష్టరునై, డబ్బు గణించి, ఖర్చుచేసి, ఏదో కొంత పెద్దరికం సంపాదించగలిగా నంటే దానికి అతనే ముఖ్యకారణ మని చెప్పాలి. ముందుముందు ఆ విషయాలు వ్రాయవలిసివచ్చినప్పుడు ఇంకా వివరిస్తాను. మాకు ఇటీవలి జీవితంలో రాజకీయాల్లో ఎన్నో అభిప్రాయభేదాలు కలిగాయి. కాని మా హృదయాల్లో అనురాగం మాత్రం ఇనుమడించింది; కాని, అణువంతైనా చలించలేదు. ఇటీవలి ఎన్నికలలో పార్టీపట్టుదలకోసం ప్రతికూలపక్షంలో పనిచేస్తూన్నా, అతను నాకు అవసరమైన సహాయం కూడా చేస్తూ ఉండేవాడు. చిన్నప్పుడే అతనికి ఈ దేశంలో పెద్దపెద్ద పరిశ్రమలు సాగించాలని ఉండేది. పెద్దవాడయ్యాక వాటికోసం అనేక ప్రయత్నాలు చేసి కొంత డబ్బు ఖర్చుపెట్టాడు. రాజమహేంద్రవరానికి అతను మహత్తరమైన సేవ చేశాడు. అతని ఆత్మకి శాంతి కలుగుగాక!

నాకు ఇంకా జ్ఞాపకం చేసుకుంటూ ఉంటే చిట్టూరి సూరయ్య ప్రభృతులు స్ఫురణకి వస్తున్నారు. వాళ్ళందరినిగురించీ వ్రాయడానికి ఈ సందర్భంలో అవకాశం లేదు. కాని, లేకపోతే వ్రాసేవాణ్ణే. వాళ్ళలో ఎవ ళ్లైనా జీవించి ఉంటే దీనికి అన్యథా భావించ రని నమ్ముతున్నాను.

మొత్తంమీద, ఆప్తులైన స్నేహితుల మధ్య వాళ్ళందరికీ ఇష్టుడుగా ఉంటూ కులాసాగా విద్యార్థిదశ పూర్వభాగం గడిపివేశాను.

ఇంక కాలేజీచదువు మాట. ౧౮౯౫ం ఫిబ్రవరిలో రాజమహేంద్రవరం ఆర్ట్సుకాలేజీలో యఫ్. ఏ. క్లాసులో చేరాను. మళ్ళీ ఆ కాలేజీలో చేరడానికి కారకుడు హనుమంతరావునాయుడుగారే! తమజీతం ౩౦ రూపాయిలే అయినా, ఒక పెద్దకుటుంబం భరించవలిసి వచ్చినా, మరి ఎల్లాగ తంటాలు పడేవారో ఆయనకే తెలియాలి! ఆ పరమేశ్వరుడికే తెలియాలి! నేను "ఈ చదువు గట్టెక్కడం ఎల్లాగా?" అని ఆత్రత పడుతూంటే ఆయన ఎల్లాగో డబ్బు సంపాదించి ఇస్తూ ఉండేవారు. యఫ్. ఏ. లో ప్రవేశించడానికి కావలిసిన జీతంకూడా అల్లాగే ఇచ్చారు; దానికి ఆయనఇంట్లోవాళ్ళు సహజంగా కొంత బాధపడేవాళ్ళు.. ఆయన భార్య లక్ష్మమ్మగారు మాత్రం మహాఇల్లాలు. హనుమంతరావునాయుడుగారు నన్ను తన బిడ్డలకంటె కూడా ఎక్కువగా ఆదరిస్తూ ఉంటే, ఆమె కొంచెం అయినా బాధపడేది కాదు. నాయుడుగారితల్లి కొంత మమకారంతో ఏదో బాధ పడేది కాని నాయుడుగారు లెఖ్ఖపెట్టేవారు కారు; వాళ్ళకి ఏదో విధంగా సమాధానం చెప్పేవారు. ఆయనా నేనూ కలుసుకున్న వేళా విశేషం ఎట్లాంటిదో గాని ఆయనకి నే నంటే అంత వాత్సల్యం ఉండేది.

అప్పట్లో మా కాలేజీపరిస్థితులు కొంచెం వ్రాస్తాను. కాలేజీ ప్రిన్సిపాల్ మహావిద్యావేత్త అయిన మెట్కాఫ్. ఒక్క రాజమహేంద్రవరంలోనే కాక, ఆంధ్రదేశంలో ఉన్న ఆంగ్లవిద్యావంతు లెందరో

ఆయనకి కృతజ్ఞులై ఉండాలి. ఆయన విద్యార్థుల్ని తనబిడ్డలకంటే కూడా ఎంతో ఆప్యాయంగా చూసుగునేవాడు. ఆయన లెఖ్ఖలూ, ఇంగ్లీషూ, షేక్సుపియరూ కూడా అత్యద్భుతంగా చెప్పేవాడు. ఆ రోజుల్లో హెన్సుమన్ అనే అత నొక ప్రొఫెసర్‌గా ఉండేవాడు. యమ్. రంగాచారిగారు కూడా ఒక ప్రొఫెసరే. ఆయన ఇంగ్లీషు చెప్పేవాడు అనుకుంటాను. రామలింగయ్యరు అనే ప్రొఫెసరు ఫిజిక్సు చెప్పేవాడు. బజులుల్లాలాగ నాకు బట్టీ పట్టే అలవాటు ఉండేదికాదు. చదువుమీదకూడా అంతగా శ్రద్ధ ఉండేదికాదు. కాని చదివిన కాస్సేపూ ఏకాగ్రతతో చదివి ప్రొఫెసర్ల అభిమానం సంపాదించేవాణ్ణి.

ఆ రోజుల్లో చదువు చాలా హెచ్చుస్థాయిలో ఉండేది. యఫ్. ఏ. క్లాసులోనే ఇంగ్లీషులో, ఛాసరు, డీక్వేన్సీ, కార్లైలు మొదలయినవారి ఉద్గ్రంథా లన్నీ చెప్పేవారు. హిస్టరీలో ప్రపంచచరిత్ర అంతా క్షుణ్ణంగా చెప్పేవారు. లెఖ్ఖలలో ట్రిగ్నామెట్రీ, ఆల్జీబ్రా బాగా బోధించేవారు. అప్లయిడ్‌సైన్సెస్ కూడా బాగా చెప్పేవారు. అన్నిటికన్నా ముఖ్యంగా మెటాల్‌వర్క్ వడ్రం మొదలయిన చేతిపనులు కాలేజీలో అందరికీ నేర్పించే వాడు. ఆయన దానికి కారణంగా "నీ ఇంటి సామాగ్రి నువ్వు చేసుకోవడమూ, నీ ఇల్లు నువ్వు కట్టుకోవడమూ నేర్చుకోవా"లని చెప్పే వాడు; తనశిష్యకోటిలో జాతీయాభిమానమూ, జాతీయసంప్రదాయమూ బాగా వృద్ధిచేసేవాడు.

ఈ కాలంలోనే నాకు బాగా గట్టైన తగాదాలూ, కొట్లాటలూ సంభవించాయి. నా భవిష్యత్తువిషయంలో ఎంతో ఆశ పెట్టుకున్న

హనుమంతరావునాయుడుగారికీ ఇతరబంధుమిత్రులికీ ఎంతో ఆదుర్దా కలగజేశాను. కొట్లాటలు, కేసులు, ఒక టేమిటి? తెల్లవారి లేస్తే రాత్రి అయ్యేలోగా ఏమి వస్తుందో తెలిసేది కాదు!

ఆ కాలంలో నాలో ఎక్కడలేని చొరవా, అఘాయిత్యమూ ఉండేవి. ఎవరైనా నన్ను కొంచెం 'ఆఁ' అన్నారంటే చెయ్యెత్తి మాట్లాడేటంత గోరోజనం ఉండేది. చివరికి హనుమంతరావునాయుడుగారు కూడా నన్ను అదిలించలేని స్థితి వచ్చేసింది. ఈ స్థితిలోనే ౧౮౯౮ వేసవికాలంలో కాకినాడలో కొందరు నాట్యకళాభిమానుల కోరికమీద నాటకా లాడడానికి అంగీకరించి అక్కడ మకాము వేశాము. అప్పటో కాకినాడలో కూడా తాలింఖానాలూ, వాటికి సంబంధించిన గంద్రగోళాలూ చాలా హెచ్చుగా ఉండేవి.

సింగితపు అబ్బాయి అనే వేపారిపంతులు ఈ తాలింఖానాలకీ, అందులోని వస్తాదులకీ గురువు. మనిషి మంచి ఆజానుబాహువు; అప్పటికే అతనికి ౫౦ ఏళ్ళు పైగా ఉండేవి; మీసాలు, కనుబొమ్మలు నెరిసిపోయి ఉండేవి; పెద్ద బొజ్జకూడా ఉండేది. కాని మనిషి మంచి భీకరంగా ఉండేవాడు. వృత్తి ఆయుర్వేదవైద్యం. అప్పట్లో పెద్దవాళ్ళందరితోనూ ఆయనకి వైద్యసంబంధం ఉండేది. ఆయన పెద్దవాళ్ళల్లో పెద్దవాడు; రౌడీలలో రౌడీ! ఆ కాలపు కాకినాడచరిత్రలో ఆయన ముఖ్యపాత్రధారి. సామాన్యంగా నాటకాలకి ఇల్లాంటి పలుకుబడిగల బలశాలుల సాహాయ్యం ఎప్పుడూ అవసరమే. ఆ రోజుల్లో నాటకాల

శాంతిభద్రతలు ముఖ్యంగా వాళ్ళమీద ఆధారపడి ఉండేవి. ఆనాటి కాకినాడలో ఏ కసరత్ చేసినా, కర్ర తిప్పినా ప్రత్యక్షంగానో పరోక్షంగానో ఆయనశిష్యుడు అయి తీరాలి!

అందులో తాడి వెంకటరత్నం, ముమ్మడి వెంకటరత్నం, బావాజీ మొదలయిన ముఖ్యులు బాగా ప్రఖ్యాతి సంపాదించారు. ఆ తాడి వెంకట రత్నం మరీ ఒడ్డూ, పొడుగూ, కండపుష్టి ఉన్నమనిషి. మా హనుమంత రావునాయుడుగారు ఈ మనిషి ఒడ్డూ పొడుగూ చూసి నాటకం బందో బస్తుకి ఇతన్నీ, ముమ్మడి వెంకటరత్నాన్నీ, బావాజీనీ దగ్గిరికి చేర్చు కున్నారు. అంటే వాళ్ళకి నాటకాలకి ఫ్రీటిక్కెట్లు ఇచ్చి గౌరవించా రన్నమాట! మా నాయుడుగారు ఆ తాడి వెంకటరత్నాన్ని చూసి ఆయన బలశాలి అనీ, ధైర్యవంతుడనీ అపోహపడడంలో ఆశ్చర్యం ఏమీ లేదు. ఈ శాండోల బలం నమ్ముకుని నాయుడుగారు అబ్బాయి తోడ్పాటు ఆశించలేదు. ఒకటిరెండు నాటకాలు అయ్యాక సింగితం అబ్బాయి మేనల్లుడు గోపాలకృష్ణుడు ఫ్రీటిక్కెట్టు ఇవ్వాలని అడిగాడు. ఆయన ఫ్రీటిక్కెట్టు ఇవ్వలేదు. దాంతో అతను అబ్బాయి దగ్గిరికి వెళ్ళి "చూశావా! నీ శిష్యులు వెంకటరత్నం వగైరాలని ఆసరా చేసుకుని నిన్ను తోసివేశా" రని పురిఎక్కించాడు. అబ్బాయి సాధారణంగా అదుగు దిగకుండానే ఈ తాలింఖానా జనాభా నంతనీ స్వాధీనంలో ఉంచుకునేవా డని ప్రతీతి. మనిషి అకారణంగా తొందరపడే స్వభావం కలవాడు కాదని కూడా చెప్పేవారు. అయితే తనమేనల్లుడు వచ్చి పురి ఎక్కించే టప్పటికి అతను కొంచెం తొందరపడ్డాడు.

మర్నాడు మా నాటకం హాలుమీద రాళ్ళు పడ్డాయి. మా వద్దీలో ఉన్న ఈ తాడి వెంకటరత్నం వగైరాలు బయటికి వచ్చి, రాళ్లువేసే వాళ్ళని పట్టుకున్నారు. ఆ పట్టుపడ్డ వాళ్ళలో ఈ గోపాలకృష్ణుడున్నాడు. వాళ్ళతో కొంత కొట్లాట జరిగింది. అప్పైన ఆ గోపాలకృష్ణుడు మేనమామతో చెప్పుకోగా అతను కదిలి వచ్చాడు. వెంటనే మా పెండాలుమీదికీ, మేము ఉన్న ఇంటిమీదికీ ఆ అబ్బాయిసేన కదిలి వచ్చింది! మేము తలుపులన్నీ వేసుకుని లోపల కూర్చున్నాము. యనమండ్ర కొండయ్య అనే అతను ఇల్లెక్కి వచ్చి చీకట్లో మేడమీద కిటికీలో కూర్చున్న నన్ను ఒక్కదెబ్బ తీశాడు. అదృష్టవశాత్తు ఆ దెబ్బ కొంచెం ఊచకి దూసుకుపోవడంచేత నాకు గట్టిగా తగలలేదు కాని, లేకపోతే మూతి పగలవలసిందే!

ఈ దెబ్బతో బాగా పౌరుషాలు రేగాయి. "మా సహాయం లేకుండా నాటకా లాడతారా!" అని అబ్బాయి పార్టీవాళ్ళూ, "మే ముండగా మీకేమి పరవా లే"దని తాడి వెంకటరత్నం ముఠావాళ్ళూ చెలరేగారు. మా నాయుడుగారికి బాగా పౌరుషం వచ్చింది. ఆయన "అల్లరి చేస్తే ఝడిసి వెళ్ళిపోతామా! నాటకాలు ఆడవలసిందే!" అని నిశ్చయించారు. ఇల్లాంటి విషయాల్లో నాయుడుగారు చాలా పట్టుదలమనిషి. మొత్తంమీద బందోబస్తుతో నాటకాలు ఆడాము; అది అంతటితో ఆగలేదు. "విచ్చలవిడిగా ఊరేగుతాము" అనే ప్రగల్భాలు మా ముఠాలోనించీ, "ఊరేగితే తంతాము" అనే ప్రగల్భాలు వాళ్ళ ముఠాలోనించీ బయలుదేరాయి.

ఇల్లా ఉండగా నాలుగయిదురోజుల్లో దేవుడి ఊరేగింపు వచ్చింది. ఆ ఊరేగింపులోకి మేము కొందరం తయారయ్యాము. తాడి వెంకట

రత్నం ధీమాకబుర్ల వల్ల మేము ఎదటివాళ్ళ బెదిరింపులు లక్ష్యపెట్టలేదు. ఉత్సవం కాకినాడబజారు దగ్గిర మసీదుదాకా వచ్చింది. అంతవరకూ ఏ గంద్రగోళమూ రాలేదు. "ఇంక ఇంటికి వెళ్ళిపోదా" మని అనుకుంటూ ఉండగా ఆ ఎదటనించి 'ఘల్లుఘల్లు' మని గొలుసు చప్పుడూ చేసుకుంటూ అబ్బాయి స్వయంగా మామీదికి వచ్చాడు. అతనిచేతుల్లో చెయ్యెత్తు బాణాకర్ర ప్రత్యక్ష మయింది. ఆ కర్రకి ఆ చివరనించి ఈ చివరిదాకా ఒకే గొలుసు! మనిషి తనముతాతో కేవలం కాలాంతకుడు లాగ వచ్చిపడ్డాడు! పడుతూనే వస్తాద్ తాడి వెంకటరత్నాన్ని ఒకదెబ్బ తీశాడు! దాంతో పక్కని నిలబడ్డ నాకే గీరెత్తింది! తాడి వెంకటరత్నానికి నఖశిఖపర్యంతమూ దెబ్బ తగిలింది! అబ్బాయి, ఆతరవాత తాడి వెంకటరత్నానికీ, ముమ్మడి వెంకటరత్నానికీ కూడా తగిలేటట్లుగా ఒక్కదెబ్బ కొట్టాడు. ఇది ఎందుకు ఇంత వివరంగా వ్రాస్తున్నా నంటే—ఆ నాడు అబ్బాయి పోరాటపు చాకచక్యాన్ని ఉదాహరించడానికే! అతనినేర్పు, సాహసమూ అత్యద్భుతంగా ఉండేవి. దెబ్బ కొట్టడంలో మంచి శాస్త్రోక్తంగా కొట్టాడు. మూడో దెబ్బ తగిలేసరికి ఇంత బలమైన మనిషీ ఒక్కసారిగా, కాలికి బుద్ధి చెప్పాడు!

అప్పటి కింకా తాలింఖానాల్లో దెబ్బ నేర్పుగా కొట్టడమూ, ఎదటివాళ్ళు కొట్టేటప్పుడు ఒడుపుగా తప్పుకోవడమూ, నేర్పుతూ ఉండేవారు. ఇంగ్లీషురాజ్యం వచ్చి అప్పటికి కొంచెం కాలమే అవడంచేత జాతిలో ఇంకా ఆ విషయంలో ప్రావీణ్యం మిగిలే ఉంది. సింగితం

అబ్బాయి ఆ రోజున మా జనంమీద వీరవిహారం చేశాడు. నాతో కూడా ఉండిన దుగ్గిరాల గోపాలకృష్ణయ్య అనే మా ప్రధాననటకుడికి తల పగిలిపోయి మెదడు బయటపడింది. నాకు చేతులమీదా, బుజాలమీదా దెబ్బలు తగిలాయి. మాలో ముమ్మిడి వెంకటరత్నం మాత్రం ఎదటివాళ్ళ దెబ్బలు తిని మమ్మల్ని కాచాడనే చెప్పాలి.

ఈ స్థితిగతుల్లో నేను, విధిలేక పక్కనే ఓరగా తెరచిఉన్న ఒక కోమటిఇంట్లో దూరాను. ముమ్మడి వెంకటరత్నం సుమారు ౨౦౦ దెబ్బలు తిని పడిపోయాడు. నిజంగా ఈ ముమ్మడి వెంకటరత్నం మాకు అడ్డపడి, దెబ్బలు కాయకపోతే ఈ చరిత్ర అంతా జరిగేదే కాదు! వాళ్ళు పడిపోయిన కొంతసేపటికి పోలీసు లంతా యథాప్రకారంగా విచ్చేశారు! వాళ్ళతోబాటు నేనూ బయటపడ్డాను! పోలీసులు మామూలునాటకం జరిపించి అప్పట్లో వాళ్ళనిఆసుపత్రిలో చేర్చారు. మాకుపట్టుదలహెచ్చయి, ఆ ఊళ్ళో ఇంకా నాటకాలు ఆడాము. తరవాత పోలీసువాళ్ళు సింగితం అబ్బాయి మీదా అతని యోధవర్గం మీదా కేసులు పెట్టారు. కాని సాక్ష్యం ఎల్లాగ? ఎవ్వరూ సాక్ష్యం పలకడానికి సాహసించలేదు. అందరికీ సాక్ష్యం చెబితే ఏమి కొంప మునుగుతుందో అన్న భయమే! కేసు విచారించే మేజస్ట్రీటుకి కూడా భయమే అయిరి!

ఆ భయంచేతనే చామర్లకోటలో విచారణ జరిగింది. విచారణ జరిగిన తరవాత సాక్ష్యం లేదనే కారణంచేత కేసు కొట్టేశారు. దాంతో మా కసి మరింత హెచ్చయింది. "మమ్మల్ని నడిబజారులో కొడితే కేసు

లేకుండా పోవడమా!" అని బాధ కలిగింది. దీనికి ఎల్లాగయినా ప్రతీకారం చెయ్యాలనే పట్టుదల కలిగింది. ఇదీ కాకినాడ చరిత్ర!

కొద్దిరోజులకి నేను కిటికీలో కూర్చుని ఉండగాకొట్టిన యనమంద్ర కొండయ్య అనే అబ్బాయి పార్టీమనిషి ఒకనాడు రాజమహేంద్రవరం వచ్చాడు. అతను వర్తకులదగ్గిర లెఖ్ఖలు వ్రాస్తూ ఉండేవాడు. అతను ఊళ్ళోకి వచ్చాడనీ తెలిసి నేనూ, మాదిరెడ్డి వెంకటరత్నం నాయుడుగారి తమ్ముడు చలపతిరావూ—(అతను తరవాత చనిపోయాడు) మరి కొందరు జట్టువాళ్ళమూ బయలుదేరి దారి కాశాము. ఆ కొండయ్య ఊళ్ళో పని చూసుకుని కాకినాడ వెళ్ళడానికి పడవ ఎక్కాలనే ఉద్దేశంతో ఒంటెద్దు బండిమీద ధవళేశ్వరం వెడుతున్నాడు. అప్పటికి సాయంకాలం సుమారు ౪ గంట లయింది. "సమయం దొరికిందిరా!" అని నేను ముందుగా వెళ్ళి బండి దిగమన్నాను. అతను దిగకపోతే ఒంటెద్దు బండి ఎదటకి వెళ్ళి ఎద్దుని విప్పివేసి కాడి పైకి ఎత్తివేశాను. ఆ మనిషి అమాంతంగా లుంగజుట్టుకుని కిందికి జారాడు. వెంటనే చలపతిరావు, జట్టు జనాభా, నేను కలిసి అతన్ని పచ్చడికింద చితకగొట్టాము!

ఇది జరిగింది రాజమహేంద్రవరం తాలూకాకచ్చేరి ఎదట! ఆర్ట్సుకాలేజీకి ౧౦౦ గజాల దూరంలో ఉన్న మెయిన్‌రోడ్డుమీద! జనం గుంపులుగా చేరారు గాని, ఎవళ్ళూ "ఇదేమి?" టని దగ్గిరికి రాలేదు. గట్టిగా కొట్టివేసిన తరవాత మేము మా దారిని పారిపోయి, గోదావరి ఒడ్డున ఉన్న పత్రివారి దొడ్లో పడ్డాము. కొందరు మొదట మా వెంట పడ్డారు; కాని చివరికి

సబబు కాదని చెప్పాము. చలపతిరావు కొంచెం మొరటుతనంగా "మా మీద సాక్ష్యం చెప్పి, మా కే ఆరునెలలో శిక్ష వేయించినా, తిరిగి వచ్చిన తరవాత నీ ప్రాణాలు దక్కవు సుమా!" అని బెదిరించాడు.

ఏ మైతే నేమి, తీరా సాక్ష్యానికి వచ్చేసరికి దుగ్గిరాల కాశీవిశ్వనాథం "దెబ్బలాట జరుగుతూ ఉంటే చూచాననీ, అక్కడ దెబ్బలు తగులుతూ ఉంటే తనకి గీర ఎత్తిందనీ, ఇంక అక్కడ ఆగలేక వెళ్ళిపోయా ననీ, ఎవరు కొట్టారో చెప్పడం అసాధ్యం" అనీ చెప్పాడు. కొరళ్ళ సుబ్బారాయుడు సాక్ష్యానికి రానేలేదు. అతనికోసం కేసు రెండుమూడు వాయిదాలు వేశారు; గాని చివరికి పోలీసులు అతని సాక్ష్యానికి నీళ్లు వదులుకున్నారు. చివరికి కేసు విచారించిన మేజిస్ట్రీటు మేము నేరం చేసిఉండడానికి అవకాశా లున్నా యనీ, కాని, శిక్షించడానికి తగిన సాక్ష్యం లేదనీ వ్రాసి కేసు కొట్టేశాడు.

౫౦ ఏళ్ళయిన తరవాత ఇప్పుడు ఆ విషయం తలచుకుంటే నాకే ఆశ్చర్యం వేస్తుంది. ఆనాడే ఏ ఆరునెలలో శిక్ష వేసి జైలుకి పంపించి ఉంచే, ఈ జీవితం ఏ పంథాపట్టేదో, ఏ మైపోయేదో ఆ పరమేశ్వరుడికే ఎరుక! కాలు అణుమాత్రం జారితే అథఃపాతాళంలోకి పడిపోయే స్థితిలో నించి బయటపడ్డాము. ఎప్పటికప్పుడు కొండయ్య చచ్చిపోతా డనీ, కేసు ఖూనీ కే సవుతుందనీ భయంకర మైన వార్తలు వస్తూఉండేవి. కాని ప్రారబ్ధం ఎల్లా నడిపిస్తోందో ఎవరు చెప్పగలరు? కాకినాడలో అక్రమంగా కొట్టినప్పుడు మేము బ్రతకడమూ దైవికమే; మేము మళ్ళీ కొండయ్యని

కొట్టినప్పుడు అతను బ్రతకడమూ దైవికమే! ఈ సంఘటన లన్నీ దైవికంగా ఈ జీవితపుభవిష్యత్తు ఈ విధంగా నిర్ణయించాయి.

ఈగాథసందర్భంలో ఆ నాడు నా మనోభావాల పోకడలు కొంచెం వ్రాస్తాను. పాఠకులు వాటిని గురించి, ఈనాటి శాంతిసూత్రాలతో ఆలోచిస్తే లాభం లేదు. నేను ఎన్నో సాహసకార్యాల్లో పడి, ప్రమాదావస్థలు తప్పించుకున్నా నంటే దానికి దైవికమైన బలం అల్లా ఉండగా, నేను చేసిన పనిలో ఒకన్యాయం ఉన్న దనే విశ్వాసం కూడా నాకు తోడ్పడిం దనుకుంటాను. కొండయ్యని మెయిన్ రోడ్డుమీద ఉతికే సాహసం వచ్చిం దంటే, దానివెనకాల నా మనస్సు ఎంతగా ఆందోళన పడిందో గమనించాలి. కాకినాడలో అర్ధరాత్రివేళ మమ్మల్ని అక్రమంగా కొట్టారు; వాళ్ళమీద న్యాయంగా కేసు పెడితే న్యాయపక్షాన్ని సాక్ష్యం ఇచ్చేవాళ్లే లేకపోయారు! చివరికి వాళ్ళకి కాస్త బుద్ధిచెప్పే పెద్దమనిషి కూడా లేకపోయాడు! అందుచేతనే నా మనస్సులో బయలుదేరిన తీవ్రమైన ప్రతీకారబుద్ధిచేత నే నిందుకు పాల్పడ్డాను. ఆ రోజుల్లో నా మనఃప్రకృతి అల్లా ఉండేది. బహుశః అల్లాంటిదే ఇప్పుడు జరిగితే ఆ ప్రతీకారం మరో రూపం ధరించే దేమో!

ఈ కేసుసందర్భంలో నేను చూపించిన ధైర్యం తలుచుకుంటే ఇప్పటికి నాకే ఆశ్చర్యంగా ఉంది. కొట్టడం అంటే నలుగురూ కొట్టారు కాని కేసు వచ్చేటప్పుడికి అంతా జావ అయిపోయారు. ఏ పాపమూ ఎరక్కపోయినా, నాకు, అన్నివిధాలా సంరక్షకులుగా ఉండిన

హనుమంతరావునాయుడుగారు కూడా కేసులో ఇరుక్కున్నారు.ఎందుకైనా డబ్బు కావలిస్తే, ఎల్లాగో అల్లాగ సంపాదించి ఇవ్వగలరుగాని, ఆయన ఇల్లాంటి పిల్లసమ్మేరీలకి కూడా ఎక్కడ అవస్థపడగలరు? ఈ విషయంలో ఆయన కూడా నిరుత్సాహపడ్డారు. అయితే నేను చేసినదాల్లో ఏమీ తప్పు లేదనే ఒక ఘనవిశ్వాసంవల్ల ధైర్యం చిక్కబట్టుకుని బయటపడ్డాను.

సహాధ్యాయు లంతా "నేను ఈ రౌడీగందరగోళాల్లో పడిపోయా ననీ, ఇంక బయటపడడం అసాధ్యం అనీ అనుకుంటూ ఉండేవాళ్లు. నాకుమాత్రం ఎందుచేతనో నిస్పృహ కలగలేదు. ఇన్ని గత్తరల్లో పడినప్పటికీ నాకు చదువుమీదమాత్రం లక్ష్యం తప్పలేదు. యథాప్రకారంగా పాఠాలు చదువుతూనే ఉండేవాణ్ణి. ఆ విషయంలో మాత్రం నా మనస్సు ఏవిధంగానూ చెదరలేదు.

కాలేజీలో నేను మెట్కాఫ్ అభిమానశిష్యుల్లో ఒకణ్ణి. నేను నాటకాల గంద్రగోళంలో ఉన్నా, నామీద కేసులు నడిచినా, ఆయన నన్ను ఒకకంటితో కాపాడుతూ ఉండేవారు. ఒకసారి చింతలూరి కృష్ణారావూ—(ఆయన ఇటీవల చనిపోయినట్లు వింటున్నాను)—నేనూ తగువులాడుకున్నాము. అతను నాకన్న పెద్దవాడై ఉండి నేను ఒంటరిగా ఉన్నప్పుడు నన్ను కొట్టాడు. నేను అదును చూసుకుని, కొందరిజట్టు చేర్చుకుని, అతన్ని మళ్ళీ కొట్టి, కసి తీర్చుగున్నాను. అప్పట్లో నా మనస్తత్వం అంతే! ఆపైన కృష్ణారావు మెట్కాఫ్‌తో ఫిర్యాదు

చేశాడు. మెట్కాఫ్ మమ్మల్ని ఇద్దర్నీ ఎదట నిలబెట్టి "ఏమిటి సమాచారం" అని అడిగాడు. నేను అక్షరమైనా తప్పకుండా ఉన్నది ఉన్న ట్లుగా చెప్పివేసి, "నాకన్న పెద్దవాడై పైక్లాసు చదువుతూ ఉండి మాట పట్టింపు మాత్రానికి నన్ను కొట్టాడు. కనక నాకసి తీర్చుకున్నాను."అన్నాను.

దానిమీద దొర కేమీ తోచలేదు. కృష్ణారావుకేసి చూసి "దాని కేమి చెబుతా?" వని అడిగాడు. పైగా "నీకు ఏమి శిక్ష వెయ్యమన్నావు?" అవి కూడా అడిగాడు. "అది నే నేం చెబుతాను; మీ యిష్టం" అన్నాడు కృష్ణారావు. దొర విచారణ మర్నాటికి వాయిదా వేశాడు. మర్నాడు మెట్కాఫ్, మూడురోజులు తన ఇంటిదగ్గిర పనిచెయ్యడమే శిక్షగా విధించాడు. అది బహుఆనందదాయకమూ, విద్యాదాయకమూ అయిన శిక్ష! మెట్కాఫ్ బొమ్మూరు మెట్టమీద తను ఉండేచోట రాళ్ళు పేర్చి రోడ్డు వేస్తూఉండేవాడు. ఆ కొండమీద ఎప్పుడూ ఏదో పని చేస్తూ ఉండేవాడు. నేను కూడా ఆయనతోబాటు పనిచేశాను. ఆయన పని చేస్తూ ఉంటే అనేకవిషయాలు బోధపరుస్తూ ఉండేవాడు.

మెట్కాఫ్ దొరకి రాజమహేంద్రవరం అన్నా, తనశిష్యు లన్నా చాలా అభిమానం. నేను తరవాత చాలా కాలానికి ఇంగ్లాండు వెళ్ళినప్పుడు ఆవకాయ తీసుకువెళ్ళి ఆయన్ని చూశాను. మెట్కాఫ్ దంపతులు నన్నెంతో ఆదరించి భోజనం పెట్టి పంపించారు. ఆయన ఉండేచోటికి రాజమహేంద్రవరంనించి, వెదురుమొక్కలు తీసుకువెళ్ళి, వాటిని రాజమహేంద్రవరం స్మారకచిహ్నాలుగా తనగదిలో పెట్టుకున్నాడు. ఇంకా ఆ గదినిండా రాజమహేంద్రవరం చిహ్నాలు అనేకం ఉన్నాయి. మెట్కాఫ్

నాయెడల ఎంత శాంతం చూపించేవాడో, నేను ఆయనయెడల అంత స్వేచ్ఛ కనబరచేవాణ్ణి!

ఒకరోజున రాత్రి నాటకంలో వేషం వేసి పొద్దున్నే కాలేజీకి వచ్చాను. హడావిడిగా రావడంలో రాత్రివేషం తాలూకు పౌడరు కొంచెం ఉండిపోయింది. అది పురాణపండ మల్లయ్యశాస్త్రుల్లుగారి క్లాసు. ఆయనక్లాసు చాలా కులాసాగా ఉండడంచేత, బాగా శ్రద్ధగా వింటున్నాను. ఇల్లా ఉండగా మల్లంపల్లి వీరభద్రుడు అనే ఒక సహాధ్యాయి నా పౌడరు చూసి హేళనగా మాట్లాడడం ఆరంభించాడు. ఒకటిరెండుసార్లు సహించుకుని, అటేసు అదేపనిగా విసిగించడంచేత బాగా చిరాకుపడి, శాస్త్రుల్లుగారు బోర్డుకేసి తిరిగి ఉండగా, వెనక్కి తిరిగి ఫెళ్ళున ఒక్క చెంపకాయ లాగాసు!, దాంతో క్లా సంతా గొల్లుమన్నారు! శాస్త్రుల్లుగారు చట్టున నాకేసి తిరిగి, విషయం అంతా గ్రహించి, "ఏమిరా, వీరభద్రంతో షేక్‌హాండ్ చేశావా ఏమిటి?" అన్నారు! క్లాసు మరింత గొల్లుమన్నారు!

ఈ విషయం అంతా సహజంగా మెట్కాఫ్ దగ్గిరికి ఫిర్యాదుకి వెళ్ళింది. మెట్కాఫ్ నన్ను పరీక్షకి పంపించకుండా నిలిపివేస్తా నని బెదిరించాడు. దానిపైన నేను వీరభద్రుడికి క్షమాపణ చెప్పడంతో ఆ వ్యవహారం సద్దణిగిపోయింది. మెట్కాఫ్ పరిపాలనలో ఉండే విశేషం కూడా అదే! ఏదోవిధంగా తను సద్దివెయ్యడమే కాని విద్యార్థిభవిష్యత్తుకి ఎప్పుడూ భంగం కలిగించేవాడుకాడు. ఆ తరవాత చాలాకాలానికి నేను ఇంగ్లాండులో కలుసుకున్నప్పుడు ఆయన ఎంతో ఆశ్చర్యపడి "నువ్వు ఇంత వృద్ధిలోకి వస్తా వని అనుకోలేదుసుమా!" అన్నాడు.

ఈ కాలంలో రాజమహేంద్రవరంలో వీరేశలింగం గారి సంస్కరణోద్యమం చాలా తీవ్రంగా సాగుతూ ఉండేది. నేను రాజమహేంద్రవరం వచ్చేసరికి ఆ ఊళ్ళో ఈ ఆందోళన చాలా హెచ్చుగా ఉండింది. నేను మెట్రిక్యులేషన్ చదువుతూ ఉండగా, వీరేశలింగంగారి ఆధిపత్యం కింద విధవావివాహాలు జరుగుతూఉండడం జ్ఞాపకం ఉంది. మానూరి పురుషోత్తం వివాహసందర్భంలో పంతులుగారి చాకచక్యమూ, పద్ధతులూ నేను బాగా గమనించాను. తమ కార్యసాధనకి అవసర మని తోస్తే ఆయన రౌడీల సహాయమూ, లౌక్యుల సహాయమూ కుడా పొందేవాడు.

అప్పట్లో విద్యావంతులై సంఘానికి నాయకులుగా ఉండినవాళ్ళు అంతా సంస్కర్తలే. న్యాపతి సుబ్బారావు పంతులుగారు, పెద్దాడ సాంబశివరావుగారు, నేతి సోమయాజులుగారు, మొదలైన పెద్దలు చాలామంది ఆయనకి తోడ్పడుతూ ఉండేవారు. కాని ఈ పెద్దలంతా ఆ సిద్ధాంతాలు ఆచరణలో పెట్టడానికి సమయం వచ్చినప్పుడు, ఆ సిద్ధాంతాలు ఆయనికి అప్పజెప్పి, తప్పుగున్నవాళ్ళే! ఆ కాలంలోనే నా వివాహంతోబాటు మా చెల్లెలు అన్నపూర్ణ భర్త ఆకస్మికంగా మరణించాడు. పెళ్ళినాటికే ఆయన పెద్దవాడు. నాచెల్లెలువ్యక్తురాలు కాకుండానే ఆయన మరణించడం చేత, నాకు రాజమహేంద్రవరంలో కలిగిన సంస్కరణభావాలవల్ల, ఆమెకి పునర్వివాహం చెయ్యాలని దృఢసంకల్పం కలిగింది. నే నీ ప్రయత్నంలో ఉండగానే ఆమె కూడా చనిపోవడం తటస్థించింది.

యఫ్. ఏ. క్లాసు ఈ విధంగా సాగింది. కేసుల గందరగోళాలతో ఉడుకురక్తం కాస్త చల్లారింది. పైగా జీవితలక్ష్యం అంతా ప్లీడరీమీద

ఉండడంచేత చదువుకి ఏమీ ప్రతిబంధకం కలగనియ్యకుండా ఉంచాలనే ధృఢసంకల్పం ఒకటి తోడుపడింది. అందుచేత చదు వంటే బాగా శ్రద్ధ పట్టాను. నాటకాల వ్యవహారం మాత్రం ఏమీ తగ్గలేదు. మొత్తంమీద ౧౮౯౧వ సంవత్సరంలో యఫ్. ఏ. పరీక్షకి హాజరై పాసయ్యాను. అప్పట్లో యఫ్. ఏ. పాసయితే ఫస్టుగ్రేడు పరీక్షకి ప్రైవేటుగా చదవవచ్చును. అందుచేత కూడా ఆ లక్ష్యశుద్ధి ఎక్కువైంది.

౧౮౯౨ వ సంవత్సరంలో ప్లీడరు పరీక్షకోసం బాగా క్షుణ్ణంగా చదివాను. అప్పటికి ఏలూరి లక్ష్మీనరసింహంగారు బి. ఏ. పాసయి స్కూలు పెట్టుకుని ఉన్నారు. ఆయన అప్పటికి మునిసిపల్ చెయిర్మన్‌గా ఉండి మునిసిపల్ వ్యవహార మంతా ఏకహుకీగా నడిపించేవాడు. ఆయన కూడా నాతోబాటు ప్లీడరుపరీక్షకి చదువుతూఉండేవాడు. మేము ఉభయులమూ కలిసి పరీక్షకి చదువుతూ ఉండేవాళ్ళము. తీరా చదు వంతా పూర్తిఅయ్యాక నా కొక విఘ్నం వచ్చింది. ౨౧ సంవత్సరాల వయస్సుపూర్తి అయితేనే గాని ఫస్టుగ్రేడుపరీక్షకి కూర్చోడానికి వీలు లేదని ఎక్కడో ఒక నియమం ఉందిట. నేను అది చూసుకోకుండానే చదువు పూర్తిచేశాను. చివరికి ఆ అభ్యంతరం బయటికి వచ్చింది. వయస్సుసర్టిఫికెట్ కోసం అక్కడ సివిల్ సర్జనుగా ఉన్న మేజర్ కోమా దగ్గిరికివెడితే, అతను నాకు 'జ్ఞానదంతం' (Wisdom tooth) రాలేదని సర్టిఫికెట్ నిరాకరించాడు.

దాంతో నా ఆశయానికి భంగం కలిగింది. ఒక్కసంవత్సరం వృథా అయింది. ఆ సంవత్సరంతో ఫస్టుగ్రేడ్‌కి ప్రైవేటుగా వెళ్ళడానికి

అవకాశం తీసివేస్తారు. త్వరలో బి. ఏ. పాసయితే కాని ఫస్టుగ్రేడు పరీక్షకి వెళ్ళడానికి వీలు లే దనే నియమాలు వస్తున్నాయి. అందుచేత ౧౮౯౫ లో లాకాలేజీకి వెళ్ళి చదవడం తప్ప వేరే మార్గం లేదు. మద్రాసులో లాకాలేజీలో చదు వంటే తాడూ బొంగరమూ లేని నాబోటి వాడికి ఎల్లాగ సాధ్యం అవుతుంది? మళ్ళీ హనుమంతరావునాయుడుగారి కొక సమస్య. నే నాయన్ని శ్రమపెట్టడానికి మొహమాటపడ్డాను. కాని ఆయనే "ఎల్లాగో తంటాలు పడదాము; సాహసించ" మన్నారు. ఆయన డబ్బు ఎల్లాగ తెచ్చేవారో నాకు తెలియదు. అప్పుడప్పుడు అప్పులు కూడా చేశా రనుకుంటాను. కొణితివాడ జమీందారుదగ్గిర ౯౦ రూపాయలు తేవడం మాత్రం నాకు తెలుసును. ఆ జమీందారు ఫిస్టిక్ స్కూలులో నాకు సహాధ్యాయి. ఆ చనువుచేత నాయుడుగారు జమీందారు దగ్గిరికి నడిచివెళ్ళి ౯౦ రూపాయిలు పట్టుకుని వచ్చి నాకు పంపించారు.

అప్పటి కింకా మదరాసుకి రైలు పడలేదు. బెజవాడ దాకా పడవ మీద వెళ్ళి, అక్కడనించి గుంతకల్లు పోయి, గుంతకల్లునించి మదరాసు వెళ్ళాము. ఆ తరవాత మదరాసులో నేను లాకాలేజీలో చేరాను. అక్కడ, పెమ్మరాజు గుర్రాజు, సాపంగు భీమశంకరం, వరాహగిరి జోగయ్య, వేములూరి వెంకట్రాయుడు, మొదలైనవారు నా సహాధ్యాయులు. మేము నలుగురైదుగురమూ కలిసి నల్లతంబివీధిలో ఒక చిన్న భోజనవసతి ఏర్పాటు చేసుకున్నాము.

అప్పుడు లా కాలేజీకి ప్రిన్సిపాల్ నెల్సన్. అధ్యాపకులు వి. కృష్ణస్వామయ్యరుగారు, టి. వి. శేషగిరయ్యరుగారు, హెచ్. రంగప్పగారు

మొదలైన వాళ్ళు. రంగప్పగారు ఇంకా జీవించే ఉన్నారు. నెల్సన్, పీనల్‌కోడ్ చెప్పడంలో నిధి. అప్పట్లో అతని వ్యాఖ్యానమే ప్రమాణంగా ఉండేది. ఈ అధ్యాపకు లంతా చాలా పేరుకెక్కిన వాళ్ళు. నేను లాకాలేజీలో చదివిన సంవత్సరం బహుశ్రద్ధగా చదివాను. ఇండియన్‌లా అంతాచాలా క్షుణ్ణంగా చదివాను. నావిషయంలో మిత్రు లంతా కూడా మొదటితరగతిలో వస్తా నని అనుకున్నారు. కాని పరీక్షల్లో అప్పుడప్పుడు జరుగుతూ ఉండేటట్లుగానే ఆశాభంగం అయింది. మొత్తంమీద ౬౨౦ మార్కులు వచ్చినా, నాకు బాగా వచ్చిన క్రిమినల్ ప్రొసీజరుకోడ్డు పేపరు అతిగా చదవడంవల్ల సరిగ్గా వ్రాయలేకపోయాను. దాంతో నేను రెండో తరగతిలో వచ్చాను. అందే సెకండ్‌గ్రేడు ప్లీడరీపట్టా మాత్రమే లభించింది.

పరీక్ష పాసుకావడంతోనే ఒంగోలు వచ్చాను. సర్టిఫికేట్ వచ్చేటప్పటికి ఇంకా కొంతకాలం పడుతుంది. ఈ లోగానే నేను ఒంగోలు యాదాలాభంగా ఐదారు క్రిమినల్‌కేసుల్లో పనిచేసి గెలిపించాను. అప్పటి కింకా క్రిమినల్‌కోర్టుల్లో దేశభాషల్లో వాదించడమే కనక, సర్టిఫికెట్ లేక పోయినా పాసయినట్టు దాఖలా ఉండడంవల్ల వకాల్తీపని చెయ్యడానికి అనుమతి దొరికింది. అప్పటి కింకా మా అమ్మగారు హోటలుతో శ్రమ పడుతూ, శ్రీరాములుచదువు సాగిస్తోంది. నేను ఏదో ఆషామాషీగా పనిచేసి రెండుమూడువందల రూపాయలు సంపాదించాను. దాంతో ఆ తాలూకాలో నాలుగుమూలలా ఉన్న బంధువుల మూలంగా నామాట బాగా

వ్యాప్తి చెందింది. అందుచేత నాకు ఒక పెద్దసమస్య వచ్చింది. బంధువులు, చిన్ననాటి మిత్రులు, అంతా కలిసి నన్ను ఒంగోలులో ప్రాక్టీసు పెట్టమని బలవంతం చేశారు. రాజమహేంద్రవరం ఊరు గాని ఊరనీ, అక్కడ బి. యల్‌లూ, ఫస్టుగ్రేడులూ, చాలామంది ఉన్నారనీ, సెకండుగ్రేడు ప్లీడరికి అట్టే అవకాశం ఉండదనీ ఈ కారణాలవల్ల బంధువుల కందరికీ దగ్గిరిగా ఉండే ఒంగోలులో ప్రాక్టీసు పెట్టమనీ నిర్బంధించారు.

కాని నేను అంగీకరించలేదు. నాకు చిన్నప్పటినించీ విద్యాబుద్ధులు చెప్పి, నా విద్యకోసం తమకుటుంబాన్ని కూడా అసౌకర్యాల పాలు చేసి నా మీద అత్యంతమూ ఆశతో ఉన్న హనుమంతరావునాయుడుగారికి ఆశాభంగం కల్పించడం నాకు న్యాయం కా దని నిష్కర్షగా చెప్పాను. హనుమంతరావునాయుడుగారు మొదటినించీ నాతోబాటు తమ మేనల్లుడైన పిల్లారిసెట్టి నారాయణరావునాయుడికి కూడా విద్యాబుద్ధులు చెప్పేవారు. అతను చాలా సామాన్యమైన కుటుంబంలోంచి వచ్చాడు. అతనికి నాయుడుగారు జీతం వగైరాలు ఇచ్చి ఇంట్లో పెట్టుకుని శ్రద్ధగా చదువు చెప్పించారు. అతనూ నాతోబాటే చదువుకుంటూ ఉండేవాడు. అప్పుడప్పుడు నాటకాల్లో చిల్లరపాత్రలు కూడా ధరించేవాడు. నాయుడుగారి మనస్సులో అతనికి కూతు ర్నిచ్చి పెళ్ళి చేద్దా మనే ఆశ ఉండేది. కాని నారాయణరావు మెట్రిక్యులేషనూ, యఫ్. ఏ అయ్యాక తన భవిష్యత్తు కోసం ఆయన్ని ఒదిలిపెట్టి కలెక్టరుదగ్గిర శిరస్తారుగా ఉండిన తాయి శేషగిరిరావునాయుడుగారి కుమార్తెని పెండ్లి చేసుకుని తద్వారా ఉన్నతవిద్య

సంపాదించాడు. అప్పుడు అతనిచర్య అనేకవిధము లైన విమర్శలకి గురి అయింది. మొత్తంమీద నేను నాయుడుగారి దగ్గిర ఉండడానికే నిశ్చయించి, రాజమహేంద్రవరం వచ్చేశాను. కొద్దిరోజుల్లో కుటుంబం అంతా ఒంగోలునించి రాజమహేంద్రవరం మార్చడానికి నిశ్చయించి, అక్కడ ఉన్న వ్యవహార మంతా ఆపివేయడానికి తగిన ఏర్పాట్లు చేశాను.

సర్టిఫికెట్ రావడంతోటే రాజమహేంద్రవరంలో ౧౮౯౫ వ సంవత్సరంలో ప్రాక్టీసు పెట్టాను. ప్రస్తుతం కంథంవారివీధిలో మాదిరెడ్డి వీరాస్వామినాయుడుగారి ఇంటి కెదురుగా కొత్తగా నిర్మించబడిన రెండు కొట్లల్లో ప్రాక్టీసు ప్రారంభించాను. ప్రాక్టీసుకి కావలసిన పరికరాలు, కర్రపెట్టెలు, జంబుఖానాలు, కుర్చీలు, బల్లలు, మొదలయిన ఆర్భాటా లన్నీ సుబ్బారావుపంతులు గారివంటి పెద్ద ప్లీడర్లకే ఉండేవి. అప్పటికి రాజమహేంద్రవరంలో ప్రసిద్ధిగా ప్లీడరీ చేస్తూన్న వాళ్ళని గురించీ, ప్లీడర్ల పరిస్థితుల్నిగురించీ కొంచెం సూక్ష్మంగా వ్రాస్తాను.

న్యాయవాదు లంతా, బి. యల్. ప్లీడర్లు, ఫస్టుగ్రేడు ప్లీడర్లు, సెకండు గ్రేడు ప్లీడర్లు, వాలస్ పట్టాదార్లు అని నాలుగు విధాలుగా ఉండే వాళ్లు. సుబ్బారావు పంతులుగారు, మాదిరెడ్డి వెంకటరత్నం నాయుడుగారు, మాకర్ల సుబ్బారావునాయుడుగారు, చిత్రపు వెంకటాచలంగారు మొదలైన వాళ్ళంతా ఒక తరహా. వీళ్ళందరికీ సుబ్బారావుపంతులుగారు నాయకుడు. ఆయన్నిగురించీ, ఆయన రాజకీయాలనిగురించీ, ముందుముందు వ్రాస్తాను. మాకర్ల సుబ్బారావునాయుడుగారు మారడుగులవారి సంఘలో

ఉన్న కంచుమర్తివారి మేడలో ప్రాక్టీసు చేస్తూ ఉండేవారు. ఆయన దివ్యజ్ఞాన సమాజసభ్యుడు. అస్తమానమూ ఆ ధ్యాసలోనే ఉండేవాడు. అప్పటికి వెంకటరత్నంనాయుడుగారు, వెంకటాచలంగారు, ఆక్టే అంత పెద్దఎన్నికల్లో పడలేదు.

ఇంక ఫస్టుగ్రేడ్‌లో, నిడమర్తి దుర్గయ్యగారు అనే జలదుర్గ ప్రసాద రాయుడుగారు, ములుకుట్ల అచ్యుతరామయ్యగారు, నేతి సోమయాజులు గారు, వగైరాలు ఉండేవారు. వారంతా మంచి ప్రాక్టీసుదారులు. సెకండు గ్రేడులో కనపర్తి శ్రీరాములు, ఏలూరి వెంకట్రామయ్యగార్ల పైలు జోరుగా ఉండేది. ఇక వాలస్ (wallace) పట్టాదార్లలో దామరాజు నాగరాజుగారి ప్రభ జోరుగా ఉండేది. ఆయన ఒక్క అక్షరం ఇంగ్లీషు ముక్కఅయినా లేకుండా ఎంతసేపైనా చాలా సరసంగా ఆర్గ్యుమెంటు చెప్పేవాడు. అప్పట్లో కాకినాడలో ఉన్న గంజాం వెంకటరత్నం, కృత్తి వెంటి పేర్రాజుగార్లు జిల్లా కంతటికీ పెద్ద ప్లీడర్లుగా ఉండేవారు. వీరు జమీందారుల ప్లీడర్లుగా ఉండి పేరుప్రఖ్యాతులు, డబ్బూ కూడా సంపాదించారు. వీరుభయులూ కాకినాడ మునిసిపల్ రాజకీయాల్లో కూడా బాగా పేరుపడ్డారు. ఉభయులూ మెట్రిక్యులేషన్ పాసయిన ప్లీడర్లయినా కేసులు నడిపించడంలో వారికి ఏ బి. యల్. లూ సరిపోయేవారు కారు, పేర్రాజు గారు మంచి హుందా అయిన సరళిలో కేసు ఆర్గ్యుమెంటు చెప్పేవాడు. వెంకటరత్నంగారు మంచి మేధావి. ఇక ఇటు ఏలూరులో ములుకుట్ల అచ్యుతరామయ్యగారు అనే ఆయన ఉండేవాడు. ఆయన శుద్ధతెలుగు

ప్లీడరు. మనిషి మంచి స్ఫురద్రూపి. చంకీజోళ్లు వగైరాలు ధరించి దాగా దర్జాగా ఉండేవాడు. వెంకటేశ్వరరావుగారి ప్రాపకంవల్ల నూజవీడు జమీందార్లకి ప్లీడరీ చేస్తూండేవాడు. ఆయనకి ఫీజురూపాయలు ఏనుగుల మీద వేసుకుని తీసుకువచ్చి ఇచ్చేవారు. ఆనాటి వృత్తి స్థితి అది.

## ౭

# నా వృత్తి

ప్లీడరీ ప్రారంభించినప్పటినించీ నాకు ఫైలు బాగానే వచ్చిందని చెప్పాలి. ఆరు మాసాల్లో పెద్దప్లీడర్లకి కూడా తీసిపోని ఫైలు ఉండేది. నన్నంతవరకూ వెంటాడించిన లేమి క్రమంగా వెనకపట్టింది. ఏవృత్తిలో నైనా పేరు రావాలంటే ముందుపట్టిన కేసుల్లో మంచిపేరు సంపాదించాలి. నేను ప్రాక్టీసుకి వచ్చిన కొద్ది రోజులకే మంచిపేరు పడింది. క్లయింటుల విషయమై పట్టుదలగా పనిచేస్తాననే మంచివాడుక పడింది. ఆ రోజుల్లో క్రిమినల్ కేసుల్లో మేజస్ట్రీటుల ధాటీలకి నిలబడే ప్లీడర్లకి ఫైలు బాగానే ఉండేది. కేసుల్లో బలంలేదని ఇతరప్లీడర్లు వదులుకున్న కేసులు కొన్ని నా పరం అవుతూ ఉండేవి.

ఒకప్పుడు ఇద్దరు కుర్రవాళ్ళ మీద రైల్వేపార్సెలులోనించి వెండి పాళీలు తస్కరించారని కేసు వచ్చింది. పోలీసులు సారంగధరుడి మెట్ట దగ్గిర దాచిపెట్టబడిన వెండిపాళీలు చూపించారు. అందులో ఒకకుర్రవాడి తండ్రి నాదగ్గిర నౌఖరీ చేస్తూఉండేవాడు. నేను ఆ కేసు పట్టి, చోరీ ఆస్తి చూపించినంతమాత్రాన్ని నేరం రుజువు కాదని వాదించాను. మేజిస్ట్రేటు కేసు సెషన్సుకి పంపించాడు. సెషన్సుజడ్జీ ముందే ఒక అభిప్రాయానికి వచ్చాడు. అందులోనూ ఒక ముద్దాయి నేరం ఒప్పుగున్నాడు. దాంతో

నేరం ఒప్పుగున్న ముద్దాయికి ఒక సంవత్సరం శిక్ష, ఒప్పుగోనివాడికి ఐదేళ్ళ శిక్ష విధించాడు. నేను పట్టుదలకొద్దీ, వెంటనే ఆకేసు హైకోర్టుకి తీసుకువెళ్ళి, ఆడమ్సు అనే ఆయన్ని ప్లీడరుగా పెట్టి, కేసు నడిపించాను. అక్కడ ఉన్న లాపుస్తకా లన్నీ తిరగవేసి రిపోర్టుకాని కేసుల్లోవింకి ఒక తీర్పు పట్టుకున్నాను. చోరీ ఆస్తినిగురించి ఆచోకీ ఇచ్చినంత మాత్రం చేత నేరం రుజువు కాదని తీర్పు దొరికింది. ఆ తీర్పు చూపించడంతోటే సర్ డేవిస్, సుబ్రహ్మణ్య అయ్యరుగార్లు శిక్ష కొట్టివేసి, ముద్దాయీలని విడుదల చేశారు. దాంతో మరింత గణనలో పడ్డాను.

మునసబు కోర్టులో లాఫైలు ఆకర్షించాను. అప్పుడు రంగమన్నారు అనే ఆయన మునసబు. ఆయన కోర్టులో గుమాస్తాగా ఉండి క్రమంగా పైకివచ్చినవాడు. మంచి తెలివైనవాడు. జడ్జిమెంటు మంచి పకడ్బందీగా వ్రాసేవాడు. అయితే ఆయనకి లంచగొండి అనీ, పక్షపాతి అనీ కొంత అపఖ్యాతి ఉండేది. అప్పట్లో ఆయనకి ఏలూరి వెంకట్రామయ్యగారు అంటే అభిమానం. ఎందుచేతనో రంగమన్నారు నామీదల కొంచెం సద్భావం చూపించేవాడు. నే నెన్నడూ ఆయన్ని ఆశ్రయించలేదు. కాని ఎందుచేతనో ఆయన నాకు చాలా సహాయం చేస్తూ ఉండేవాడు. అందుచేత కూడా ఫైలు పెరిగింది. ఈ ప్రభ కొంతకాలం నడిచాక ఈ రంగమన్నారుకీ నాకూ తగాదా వచ్చింది.

సుబ్బారావుపంతులుప్రభృతులు, ఆయన లంచగొండి అనీ, కొందరు ప్లీడర్లంటే ప్రత్యేకాభిమానం చూపిస్తాడనీ తద్వారా న్యాయ

వ్యవహారాలకి నష్టం వస్తోం దనీ, హైకోర్టుకి పిటీషన్ పెట్టారు. అందులో నన్ను కూడా సంతకం చెయ్య మన్నారు. అల్లాంటి కింవదంతులు, గోల ఉండేవి. కనక నేను కూడా దస్కతు పెట్టాను. దాంతో ఆయనకీ నాకూ చెడిపోయింది. ఇంతమంది ప్లీడర్ల పిటీషన్‌మీద హైకోర్టువారు అది విచారణకి పంపారు. రంగమన్నారు చాలా ఘాటైన సమాధానం వ్రాశాడు. అసలు వ్యవహార మెట్లా ఉన్నా సమాధానం మంచి చాకచక్యంగా వ్రాశాడు.

దాంతో అతను నిర్దోషిగా నిర్ణయించబడ్డాడు. హైకోర్టువారి నిర్ణయంచేత ఆయన మరీ తాడుబొరిపోయాడు. ఆయనకి ఆశ్రితపక్షపాతం మరింత హెచ్చయింది. కాని నాకు మాత్రం ఆయన వ్యతిరేకి అయ్యాడు. దాంతో నాకు స్థానికంగా కొంత సివిల్‌ప్రాక్టీసు తగ్గింది. కాని క్రిమినల్ వ్యవహారం బాగానే నడిచింది. నా ప్రాక్టీసు రాజమహేంద్రవరంలోనే కాకుండా జిల్లాలోనూ, పక్క నున్న ఏలూరు వగైరా పట్టణాల్లోనూ కూడా బాగానే ఉండేది. డబ్బు కూడా దానికి తగినట్లుగానే వస్తూ ఉండేది. ప్లీడరు, సంపాదనలో తనవిలవ తానే నిర్ణయించుకోవాలి. నేను నా విలవ చాలా హెచ్చుగానే ఉంచా నని చెప్పా లనుకుంటాను. నా తోటిప్లీడర్లు అందులోనూ బి.ఏ. బి.యల్‌లు కూడా ౨౫ రూపాయలు పుచ్చుకునే కేసులో నేను నిర్మోహమాటంగా వందరూపాయలు పుచ్చుకునే వాణ్ణి. ఒకకేసులో పోలవరం, జంగారెడ్డిగూడెం మొదలయిన చోట్లకి వెళ్ళినందుకు పల్లకీవగైరాల ఖర్చులు గాక రోజుకి నూరురూపాయిలు పుచ్చుగున్నాను. డబ్బనేది పోయేటప్పుడు ఎల్లాగ చేతులూ, కాళ్ళూ వచ్చిపోతుందో వచ్చేటప్పుడు కూడా అల్లాగే వస్తుంది.

నాకు, డబ్బు వచ్చేటట్లుగానే సంసారం ఖర్చు కూడా చాలా దూబరాగానే అయింది. ఒంగోలులో ఉండే కుటుంబం అంతా బంధువులతో సహా రాజమహేంద్రవరం చేరారు. హనుమంతరావునాయుడుగారి కుటుంబ భారం కూడా కొంతవరకు, భరించడంలో నేను నావిధి కొంచెం మాత్రమే నిర్వర్తించగలిగాను. డబ్బు కనపడ్డప్పటినించీ ఖర్చు కూడా ఎక్కువైంది. మొట్టమొదట కొన్ని రోజులుదాకా, కోర్టుకి వెళ్ళడానికి ఒంటెద్దు బండి పెట్టాను. స్వయంగా ఆ బండికి రంగులు వేయించి ఒక ప్రత్యేకత ఏర్పడేటట్లు చేశాను. తరవాత కొంతకాలానికి ఒక డాకార్టూ, చక్కని పోనీ కొన్నాను. ఆ తరవాత గుఱ్ఱాల్ని కొనడం, వాటిని పెంచడం. కొంతకాలం అయింది. అప్పటికి డాకార్టు పెద్ద ప్లీడరైన నేతి సోమయాజులుగారికి ఒక్కరికే ఉండేది. అప్పట్లో ఆయనతోపాటు నాకు కూడాడాకార్టు ఉండాలని సరదాగా ఉండేది.

మొదట్లో—అనగా ప్రాక్టీసు ప్రారంభించిన కొద్దిరోజుల్లోనే నేను పట్టిన పెద్దకేసుల్లో మాగంటి లక్ష్మణదాసు కేసు ఒకటి. దానికి అర్ధణా కేసని పేరు. లక్ష్మణదాసు ఏలూరుదగ్గిర చాటపర్రుగ్రామస్థుడు. కమ్మ: మంచి పలుకుబడి గలవాడు; అతను ఒకసారి టోలుగేటుఫీజు అర్ధణా ఇవ్వకుండా పోయి, కంట్రాక్టరుమీద జబర్దస్తీ చేశాడని కేసు. ముందు బెంచికోర్టులో కేసు పెట్టారు. కాని ఎప్పుడైతే అతను పట్టుదలకొద్దీ వాదించదలచుకున్నాడో అప్పుడు పోలీసులు దాన్ని పెద్దకేసుగా మార్చి ఏలూర్ సబ్‌కలెక్టరుదగ్గిర పెట్టారు. అప్పుడు సబ్‌కలెక్టరు కెర్షాప్ అనే

పార్సీ ఐ.సి.యస్. ఉద్యోగి; అతను మొదటినించీ ముద్దాయికి వ్యతిరేక మైన రిమార్కులు పాసుచేస్తూ ఉండడంవల్ల, అతను కేసు విచారణ చేయకూడదనీ, ఇంకొక మేజస్ట్రీటు దగ్గిరికి కేసు మార్చవలసిందనీ హైకోర్టుకి పిటీషన్లు పెట్టాను. అతను ఆ పిటీషన్‌లు లక్ష్యం చెయ్యకుండానే కేసు విచారించి, ౩౦౦ రూపాయలు జరిమానా విధించేటట్లు కనబడ్డాడు; అతని ధోరణి చూస్తే శిక్ష కూడా విధించేటట్లు కనబడ్డాడు. నేను అడుగడుగుకీ అడ్డు పిటీషన్లు తగిలించి అతన్ని మరీ విసిగించాను. అందుచేత రాజమహేంద్రవరం జిల్లాకోర్టులో అప్పీలు వచ్చింది. ఎవరో సీనియర్ ప్లీడరిని ఏర్పాటు చేసి కేసు నడిపించాను. కాని కిందికోర్టు తీర్పే ఖాయపడింది. ఆపైన హైకోర్టుకి అప్పీలుచేయించి, అప్పీలు విషయంలో స్వయంగా కృషిచేసి, కేసు గెలిపించాను. దాంతో నాపేరు అటువైపుని బాగా పాకింది. ప్లీడరీలో మొదటినించీ కూడా స్వతంత్రత చూపిస్తూ, సీనియర్లు అనేవాళ్ళ నాట్టే లక్ష్యపెట్టకుండా, తొందరగా ప్రాక్టీసు సంపాదించడంవల్ల, తోటి ప్లీడర్ల అసహనానికి పాత్రుణ్ణి అయ్యాను. తత్ఫలితంగా కొందరు ప్లీడర్లు నామీద కక్ష కట్టారు కూడాను. దానికి ఏమీ కారణం లే దని నా నమ్మకము. అందులో ముఖ్యులు నేతి సోమయాజులు, ములుకుట్ల అచ్యుతరామయ్యగార్లు. నేతి సోమయాజులు గారు గవర్నమెంటు ప్లీడరు కూడాను. ఆయన నామీద కక్ష సాధించడానికి ఏ పని చెయ్యడానికీ కూడా సందేహించలేదు.

ఇల్లాగ ప్రాక్టీసు బాగా సాగుతూండగా నేను ఆనాడు

రాజమహేంద్రవరం అంతా కలవరపరుస్తూ ఉన్న మునిసిపల్ వ్యవహారాల్లో పడ్డాను. ఒక కేసులో ముద్దాయితరపున నేను, ఫిర్యాదితరపున ఆయన హాజ రయ్యాము. కేసు తాడినాడ వెంకట్రామయ్య అనే మేజస్ట్రీటు దగ్గిర. ఆయన వింతపద్ధతి అవలంబించి వకీలుగా ఉన్న నన్ను, సాక్షిగా పిలిపించాడు. నాచేత సాక్ష్యం పుచ్చుగుని తనతరపున మరి కొందరి సాక్షులచేత నేను చెప్పినదానికి విరుద్ధంగా చెప్పించి, అబద్ధం సాక్ష్యం ఇచ్చినందుకు నామీద ప్రాసిక్యూషన్ కోసం పిటీషన్ పెట్టాడు. ఒకప్లీడరు ఇంకొక ప్లీడర్ని ఇల్లాగ కక్ష సాధించడం చాలా అపూర్వమైన విషయం: మేజస్ట్రీటు చాలా క్లిష్టపరిస్థితుల్లో పడ్డాడు. కాని సోమయాజులుగారు గవర్నమెంటుప్లీడరుగా తనకి ఉన్న పరువుప్రతిష్ఠలు ఉపయోగించి మేజస్ట్రీటునిస్వాధీనపరచుకున్నాడు. కేసుపై లయిందిరాజమహేంద్రవరం జాయింటుమేజస్ట్రేటు దగ్గిర. వెనక లక్ష్మణదాసు కేసులో ఏలూరులో ఉన్న కెర్షాప్ అప్పటికి రాజమహేంద్రవరం సబ్ కలెక్టరుగా వచ్చాడు.

ఇంక అడిగే దేముంది! అందరూ 'అతనికి నా మీద ఏదో కొంచెం ఆగ్రహం ఉండకపోదనీ, నాకు తప్పకుండా శిక్ష పడుతుం దనీ అనుకున్నారు. నేనే కెర్షాప్‌దగ్గిర స్వయంగా హాజ రయ్యాను. ఆ కెర్షాప్ దగ్గిర నేను చూసిన ఉత్కృష్టత ఏమి టంటే—ఆయన నన్ను చూసి ముందుగానే "ఏమండీ! ఈ కేసు నేను విచారించడానికి ఏ మైనా అభ్యంతరం ఉందా? ఏలూరు సమాచారంవల్ల మీకు నామీద ఏ దైనా అనుమానం ఉందా?" అని అడిగాడు. నాకు అల్లాంటి సంకోచం ఏమి

లే దనీ, కేసులో విచారణ న్యాయంగా జరుగుతుం దనే నమ్మకం నాకు ఉందనీ చెప్పాను. ఆపైన ఆయన కేసు విచారించాడు. సోమయాజులు గారు తను అల్లగలిగిన కథ అంతా అల్లాడు; కాని కెర్షాప్ చివరికి నేను నిర్దోషి నని తీర్పు ఇచ్చి, ఇల్లాంటి అభూతకల్పనాయుత మైన కేసు ఎన్నడూ జరగలే దనీ, గవర్నమెంటుప్లీడరు తన పలుకుబడి దుర్వినియోగం చేశా డనీ వ్రాశాడు.

---

## ౧

# మునిసిపల్ రాజకీయాలు

నేను స్వతంత్రంగా కాలక్షేపం చేస్తూ, రెండుచేతులా డబ్బు సంపాదిస్తూ ఉండి, ఆనాటి రాజమహేంద్రవరం మునిసిపల్ రాజకీయాల్లో పడ్డాను. రాజమహేంద్రవరం మునిసిపాలిటీ ఆంధ్రదేశంలో కల్లా పురాతనమైన మునిసిపాలిటీ. దానికి సుమారు ౫౦, ౬౦ వేల రూపాయలు ఆదాయం ఉండేది. నేను రాజమహేంద్రవరం చదువుకోసం వచ్చే రోజులకే మునిసిపల్ రాజకీయాలు బాగా జోరుగా ఉండేవి. అప్పటికి శ్రీ ఏలూరి లక్ష్మీనరసింహంగారు మునిసిపల్ ఛైర్మన్‌గా ఉండేవారని ఇదివరకే వ్రాశాను. ఆయనకి పూర్వం ఉద్యోగస్థులు—అంటే కాలేజీప్రొఫెసర్లు, రెవిన్యూఉద్యోగస్థులు ఛైర్మన్లుగా ఉండేవారు. ఏలూరి లక్ష్మీనరసింహం గారే మొదటి నానఫీషియల్ ఛైర్మన్. మునిసిపాలిటీలో ఆయన కిరీటం లేని రాజులాగ చలామణీ అయ్యాడు. అప్పటికే సుబ్బారావు పంతులు గారు, ములుకుట్ల అచ్యుతరామయ్యగారు, నేతి సోమయాజులుగారు మొదలైనవారు, పురప్రముఖులై, ఏలూరి లక్ష్మీనరసింహంగారిని ఓడించ డానికి అవకాశం వచ్చినప్పుడల్లా ఏదో విధంగా ప్రయత్నిస్తూనే ఉండేవారు. ఆయనమీద ఏవో రకరకాల పన్నాగాలు పన్నేవారు. సుబ్బారావు పంతులు గారు ప్రసిద్ధరాజకీయనాయకులై అతరవాత 'ఆంధ్రభీష్మ' బిరుదం

పొందగలిగారు; కాని, అప్పట్లో స్థానికరాజకీయాల్లో బహులౌక్యులు. తమరు వెనకాల ఉండి తమ ముఖ్యశిష్యులచేత తమాషాగా నాటక మాడించే వారు. ఆయనకి అదొక విలాసం; ఇతరులమీద బహునేర్పుగా దెబ్బలుతీస్తూ ఉండేవారు; కాని ఏలూరి లక్ష్మీనరసింహంగారు మాత్రం లొంగేవారుకారు. మెరకవీధి తెలగాలు, షాహుకార్లు కొందరు, ఆయనకి పట్టుగా ఉండి సుబ్బారావుపంతులు ప్రభృతులుచేసే ఎత్తులు అన్నీ భగ్నం చేసేవారు.

లక్ష్మీనరసింహంగారిమీద అనేకరకాల నిందలు పడ్డాయి. ఆయనకి స్త్రీలోలత్వం ఉండేది. కాని ప్రజల సొమ్ము స్వవినియోగం చేసుకునే మనిషిమాత్రం కాడు. కాని చాలాకాలానికి సుబ్బారావుపంతులుప్రభృతులు ఆయనమీద ఎత్తిన దండయాత్రలకి లొంగిపోయాడు. సుబ్బారావుపంతులు ప్రభృతులికి వీరేశలింగం పంతులుగారు, ఆయన వివేకవర్ధనీపత్రిక కూడా తోడయ్యాయి. ఏలూరి లక్ష్మీనరసింహంగారిమీద ఆ పత్రికలో వ్యంగ్యంగా అనేకచిత్రమైన కథలు వ్రాసేవారు. అందుమీద లక్ష్మీనరసింహంగారు పరువునష్టం దావా వేశారు. ఆ దావాలో జస్టిఫికేషన్ ప్లీ పెట్టి లక్ష్మీనరసింహంగారిని అనేకసాక్ష్యాలతోటీ, సంపన్నాలతోటీ వాగా అల్లరి పెట్టారు. అందుచేత ఆయన నిస్పృహ చెంది ఈ రాజకీయాల్లో నిడమర్తి దుర్గయ్యగారిని తనస్థానే ప్రవేశపెట్టారు.

దుర్గయ్యగారు చాలాకాలం ఛైర్మన్‌గా ఉన్నారు. ఈ మునిసిపల్ వ్యవహారాల్లో రాయపూడి సుబ్బారాయుడు అనే వైశ్యప్రముఖుడు ఒకాయన చాలా ఎన్నికలోవాడు. ఆయన అట్టే చదువుకున్నవాడు కాడు. కాని

మునిసిపల్ వ్యవహారాల్లో అందెవేసిన చెయ్యి. ఎవరు మునిసిపల్ కౌన్సిలరు కావా లన్నా, ఛైర్మన్ కావాలన్నా ఆయనసహాయం లేకపోతే అది అసంభవమే! ఆయన చాలా ప్రతిభావంతు డనే చెప్పాలి. దుర్గయ్య గారు ఆయనసహాయంతోటే చాలాకాలం ఛైర్మన్ చేశారు. ఏలూరి లక్ష్మీనరసింహంగారు కూడా దుర్గయ్యగారికి అండగా నిలిచి పనిచేశారు. సుబ్బారావు పంతులుగారు, నేతి సోమయాజులుగారు మొదలయిన వారు కౌన్సిల్లోకి రావడానికి ఎన్నో విధాలుగా ప్రయత్నాలు చేశారు కాని జయించలేకపోయారు. చివరికి ప్రభుత్వపు ప్రాపకంవల్ల సోమయాజులు, సుబ్బారావు పంతులుగార్లు కౌన్సిల్లో నామినేటెడ్ సభ్యులుగా ప్రవేశించారు. కాని దుర్గయ్యగారికి ఉండిన మెజారిటీవల్ల వాళ్ళమాట సాగేది కాదు. వాళ్ళు చివరికి విసిగి వేసారి రాజీనామాలు ఇచ్చివేశారు.

ఈ వ్యవహారాల్లో రాయపూడి సుబ్బారాయుడు బొమ్మల్ని ఎక్కించి దింపించేటంత ప్రతిభాశాలి అని వ్రాశాను. అతనికి మునసబు కోర్టులో చాలా దావాలు ఉండేవి. రంగమన్నారు కాలంలో అతను నాకు క్లయింటు అయ్యాడు. అప్పటికి ఆయనకీ దుర్గయ్యగారికీ ఏవో అంతశ్శీతలాలు బయలుదేరాయి. బయలుదేరడంలో ఆశ్చర్యం ఏమీ లేదు! ఛైర్మన్‌పదవికి సహాయం చేశారు కనక పరిపాలనలో కొంచెం లోతుగా జోక్యం కలగ జేసుకునేవారు. దుర్గయ్యగారివంటి స్వతంత్రుడు దానికి అంగీకరించకపోతే సహజంగా తగాదా వచ్చేది. కనక ఆ రాయపూడి సుబ్బారాయుడి దృష్టి నామీద పడింది. అప్పట్లో నాకు ఎల్లాగైనా బి.ఏ. పూర్తిచేసి

ఫస్టుగ్రేడు పాసు కావాలని ఉండేది. హనుమంతరావునాయుడిగారి సలహా పైని బి.ఏ. పార్టుగా పాసుకావడానికి సంకల్పించుకుని ముందు తెలుగుకి హాజరై పాసయ్యాను. కాని ఈ మునిసిపల్‌వ్యవహారాల్లో పడి ఆ చదువుకి స్వస్తి చెప్పవలసివచ్చింది.

ఆకాలంలో మునిసిపాలిటీకి ప్రతిసంవత్సరమూ ఎన్నికలు జరుగుతూ ఉండేవి; ఖాళీ అయిన ప్రతిస్థానంలోనూ మనుష్యుల్ని కూర్చుకుని ఛైర్మన్‌ఎన్నిక వచ్చేసరికి బలాబలాలు తేల్చుకుంటూ ఉండేవాళ్ళు. సుబ్బారాయుడుప్రభృతుల ప్రోత్సాహంమీద నేను ఎన్నికలకి నిలిచినప్పుడు, దుర్గయ్యగారు నన్ను రాకుండా చెయ్యడానికి ప్రయత్నించేవారు. నేను అతిశ్రమపడి అన్ని ఏర్పాట్లూ చేసుకునేసరికి, ఆఖరురోజు రాత్రి ఆయన తన ఛైర్మన్‌పలుకుబడి అంతా ఉపయోగించి వోటర్లని తిప్పివేసేవాడు. నేను మొట్టమొదట ఏ వార్డుకి నిలబడ్డానో జ్ఞాపకం లేదు కాని ౧౮౯౬లో ఎన్నికలకి నిలబడినట్లు గుర్తు. కాని అప్పుడు ఓడిపోయాను.

మళ్ళీ ౧౮౯౭,౯౮ సంవత్సరాల్లో బై ఎలక్షన్‌లలో అభ్యర్థిగా ఉన్నాను. దుర్గయ్యగారు మొత్తం మూడుసార్లూ కూడా నన్ను ఓడించారు. నేను ఏవో ఎన్నికల పిటీషన్లు వగైరాలు పెడుతూ ఉండేవాణ్ణి. వాటిని అన్నిటినీ దుర్గయ్యగారు ఎదురుకుంటూ ఉండేవారు. దుర్గయ్యగారు మొత్తంమీద చాలా ప్రతిభావంతులు; మేధావులు; సర్వస్వతంత్రులు; నైతికోన్నతీ, పరిపాలనాశక్తీ, ధైర్యస్థైర్యాలూ ఉన్నవారు. మరిఒకరు

అయితే సుబ్బారావు పంతులుగారి ఎత్తుల్లో పడి పల్టీలు కొట్టవలసిన వారే! ఆయన పరిపాలనలో కూడా చాలా హుందాతనం చూపించారు. ఆనాటి పార్టీకక్ష లెంత తీవ్రంగా వెళ్ళా యంటే—ప్రతికక్షులు చివరికి దుర్గయ్యగారిమీద కూడా అక్రమమైన ఆరోపణలు చేసేవారు. దుర్గయ్య గారు నాకు ప్రతికక్షిగా పనిచేసినా ఆయనధైర్యమూ, సమర్థతా మొదలయిన సుగుణాలుచూస్తే నాకు ఆయనయందు అభిమానం ఉండేది.

నేను ౧౯౨౮ లో కాబోలు మండవిల్లి సుబ్బారావుగారిమీద పోటీచేసి ఓడిపోయాను. అప్పుడు ఛైర్మన్ పదవిపలుకుబడి అంతా వినియోగించి, వోటర్లని తిప్పివేసి నా ఎన్నికకి భంగం కలిగించారు కనక ఎన్నిక రద్దు చెయ్యవలసిం దని సబ్‌కలెక్టరుకి పిటీషన్ పెట్టాను. దానిమీద సబ్‌కలెక్టరు దుర్గయ్యగారికి నోటీసు పంపించి, కోర్టుకి రప్పించి, కుర్చీమీద కూర్చోపెట్టాడు. అప్పుడు నేను ఆ సబ్‌కలెక్టరుతో "ఏమండీ! నేను ఆ పెద్దమనిషిమీద నేరం ఆరోపిస్తే, మీరు ఆయనకి కుర్చీ ఇచ్చి, కూర్చోబెట్టి, నన్ను దోషారోపణ చెయ్యమనడం ఏమి సబబుగా ఉంది?" అని అడిగాను. అందుమీద సబ్‌కలెక్టరు దుర్గయ్యగారికేసి చూసి "దీనికి మీరు ఏమంటారు?" అన్నాడు. ఆ పైన దుర్గయ్యగారు నిర్భయంగా "నేను కాన్వాసు చేసినమాట నిజమే! ఆ పెద్దమనిషి కౌన్సిల్లోకి రావడానికి ఎంత ప్రయత్నం చేస్తున్నాడో, రాకుండా చెయ్యడానికి వోటర్ని అయిన నాకూ అంత హక్కుంది" అని వాదించారు. నేను ప్రతివాదన చెప్పినా ఆ చెప్పిన సాహసపద్ధతికి చాలా సంతోషించాను.

సబ్‌కలెక్టరు ఏమీ కలగజేసుకోలేదు. ఆఖరికి నన్ను ౧౯౧౯లో, నాలగవవార్డులో కౌన్సిలరుగా ఎన్నుకున్నారు. దుర్గయ్యగారిని తప్పించడానికి ప్రయత్నంచేస్తూ వచ్చిన సుబ్బారావుపంతులుగారు కూడా కొంచెం సంతోషించారు. నేను కౌన్సిలర్ని అయినప్పటినించీ ప్రతి సంవత్సరమూ వచ్చిన బై ఎలక్షన్లలో పోటీలు పెట్టి దుర్గయ్యగారి మనుష్యుల్ని ఓడించాను. క్రమంగా రెండేళ్ళలో దుర్గయ్యగారి పార్టీమనుష్యుల్ని అందర్నీ ఓడించి, రాయపూడి సుబ్బారాయుడూ నేనూ మా మనుష్యుల్ని కౌన్సిల్లో ప్రవేశపెట్టగలిగాము.

౧౯౦౧ వ సంవత్సరంలో దుర్గయ్యగారి ఛైర్మన్‌పదవి ఖాళీ అయింది. అప్పుడు స్నేహితు లంతా నన్ను ప్రోత్సాహం చేశారు. సుబ్బారావు పంతులుగారు దుర్గయ్యగారి పార్టీని ఓడించినంతవరకు ఆంతర్యంలో సంతోషించేవారే కాని నేను ఛైర్మన్ అవుతా నంటే ఎంతమాత్రమూ ఇష్టపడేవారు కారు. ఆయన స్వతః నేను స్వతంత్రుణ్ణి అనీ తమ చెప్పు చేతల్లో ఉండననీ నిశ్చయించుకుని వ్యతిరేకంగా పనిచేశారు.

అప్పటికి నా ప్రాక్టీసు బాగానే ఉండేది. చిన్నప్పుడు నా సహాధ్యాయీ,హనుమంతరావునాయుడుగారి మేనల్లుడూఅయిన పిల్లారిసెట్టి నారాయణరావు బి.ఎ., బి.యల్ పాసయి హైకోర్టు వకీలు అయ్యాడు. మేము ఉభయులమూ రిజిష్టర్డు పార్ట్నర్‌షిప్ ఏర్పాటు చేసుకుని జాయంటు ప్రాక్టీసు ప్రారంభించాము. సెంట్రల్ మార్కెట్టుకి ఎదురుగా ఉన్న కోకా వెంకటేశ్వరరావుగారి ఇంట్లో మా ప్రాక్టీసు. జిల్లాకోర్టుపని అతనూ

